



ఇది మన అందరి పత్రిక. విద్యారంగంలో వస్తున్న మార్పుల చర్చావేదిక 'నవీన విద్య'. క్లాసు క్లాసులో బోధనా విధానం, క్లాసు నియంత్రణ, పిల్లల విద్యాప్రగతిపై మూల్యాంకనల సంబంధించి వ్యాసాలు రాసి పంపండి. వీలైన క్లుప్తంగా, అందరికీ అర్థమయ్యేలా మీ అభిప్రాయాలూ జోడించి రాయండి.

మీ వ్యాసాలు 4 పేజీలకు మించకుండా ఈ క్రింది అడ్రస్‌కు పంపండి. అలాగే పాస్‌పోర్ట్‌సైజ్ ఫొటో జతచేయడం మరవొద్దు.

గమనిక: ప్రచురణకు అర్హమైన వ్యాసాలకు తగిన పారితోషికం ఉంటుంది.

తక్షణం స్పందించి.. మీ భావాలను పేపర్‌పై పెట్టండి. మీ ఉత్తరాలు పంపించాల్సిన చిరునామా...


**NAVEENA VIDYA**
3-6-182/1&2, Urdu Hall lane, Street No.: 17,
Himayathnagar, Hyderabad - 500 029.
Ph: 040 -23220891. 90303 21433
editor.naveenavidya@gmail.com




KRSA101M251



# లెటర్స్

naveena Vidya

Publisher:
M. SREEDHAR RAO

On Behalf Of:
AKSHARA ENTERPRISES
D.NO. 3-6-521, FLAT NO.401
GHARONDA MAYA
HIMAYATH NAGAR
HYDERABAD-500029.

Email:
editor.naveenavidya@gmail.com

Editor:
N. Mohan Kumar

Editorial Team:
T. Lalitha Prasad
Suman

Designer:
S. Harika

Cartoonist
Nagesh

Chief Coordinator (Ops&Mktg)
K. Sreenivas

Advertisments
K. Mallikarjun

Printed at:
SREE MATHA PRINTERS
1-1-562/1, GANDHI NAGAR
HYDERABAD–500 020

Subscriptions Rates:
Annual. Rs. 300/-

**శర్మగారి కథనాలు అద్భుతం!**

అజేయకుమార్‌గారి ప్రాథమికోన్నత విద్య, బోధనాభ్యసనం కథనం ఎంతగానో సమగ్రంగా ఉంది. ఇటువంటి కథనాలు మరిన్ని ప్రచురించగలరు. అజేయకుమార్‌గారికి మా అభినందనలు. మా గురుతుల్యులు సర్వేశ్వరశర్మ గారు ఎప్పుడో మాకు తరగతిలో చెప్పిన శాస్త్రవేత్తల కథనాలు మళ్లీ నవీన విద్య ద్వారా అచ్చులో చూసుకోవడం మాకు ఎంతగానో సంతోషం కలిగించింది. గురువుగారికి నమస్కారాలు.

*బలుసు, వీరవెంకట సత్యవరప్రసాద్, అనకాపల్లి.*

**హోంవర్క్‌పై కథనానికి థ్యాంక్స్**

హోంవర్క్...ఇంటిల్లిపాదికీ టెన్షన్ అనేది కథనం నిజంగా ప్రతి తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు చదవాల్సిన కథనం.హోంవర్క్‌విషయంలో ఉపాధ్యాయులు, విద్యార్థుల దృక్పథం ఎలా ఉండాలనే విషయంపై ఎంతో సమగ్ర సమాచారం ఇచ్చారు. ధన్యవాదాలు.

*దొడ్డపనేని రేణుక, దొడ్డపనేని మాధవి, చెన్నై*

**క్లబ్‌లు ఎంతో బేష్!**

క్లబ్‌లు పెట్టండి అంటూ ఇచ్చిన కథనం ఎంతగానో ఉపయుక్తంగా ఉంది. మా స్కూల్లో ఇప్పటికే కథనంలో పేర్కొన్న ఒకటి రెండు క్లబ్‌లు ప్రారంభించాం. ఇటువంటి చక్కటి కథనం ఇచ్చినందుకు ధన్యవాదాలు

*సతీష్, విజయనగరం*

**ఇదే నాణ్యత కొనసాగించండి**

జిడ్డు క్రిష్ణమూర్తి భావజాలాన్ని విశ్వవ్యాప్తం చేస్తు సహ్యాద్రి స్కూలుపై ఇచ్చిన వ్యాసం బాగుంది. ఇటువంటి స్కూళ్లపై మరిన్ని కథనాలు ఇవ్వగలరు. ఇటువంటి స్కూళ్లలో పిల్లల్ని చేరాలని అనుకునే మాలాంటి తల్లిదండ్రులకు ఎంతగానో బాగుంటుంది. నవంబర్ సంచికలోని కథనాలు అన్నీ ఎంతగానో బాగున్నాయి. రాబోయే సంచికల్లోనూ ఇదే నాణ్యత కొనసాగించండి నవీన విద్య బృందానికి ప్రత్యేక అభినందనలు.

*ఎమ్. శ్రీధర్‌రావు, ఒంగోలు.*

**ఆరోగ్య జాగ్రత్తలు చెప్పించండి**

కేవలం బోధన సంబంధిత అంశాలే కాకుండా విద్యార్థులకు ఉపయోగపడే ఆరోగ్యసూత్రాలనూ అందించగలరని మనవి

*అనంత లక్ష్మి, పేరెంట్, ఒంగోలు*

**తెలుగుబోధన గురించి చెప్పాలి**

తెలుగు యొక్క ప్రాముఖ్యతను, తెలుగును ఎంత చక్కగా చెప్పవచ్చో, కథనాలు నిపుణులతో రాయించి ప్రచురించగలరు.

*అంకమస్తాన్, పెరవలి పాలెం.*



టీచర్లు
తల్లిదండ్రులు
విద్యార్థుల
చర్చావేదిక

# నవీనవిద్య

నేరుగా మీ ఇంటికే ...




ఇప్పుడే చందాదారులుగా చేరండి



డీడీ/మనియార్డర్/చెక్‌లను "నవీనవిద్య" పై తీసుకోవాలి.
మీ డీడీ, మనియార్డర్లు, చెక్‌లు పంపాల్సిన చిరునామా

**Naveena Vidya**
3-6-182/1&2, Urdu Hall lane, Street No.: 17, Himayathnagar,
Hyderabad - 500 029. A.P.
Ph: 040 -23220891. 90303 21433

**అవుట్ స్టేషన్ చెక్‌ల క్లియరెన్స్ కోసం అదనంగా మరో 20 రూపాయలను చందా మొత్తానికి జత చేయండి.**

---

వ్యక్తిగత వివరాలు

**మీరు:**

టీచర్ ☐
పేరెంట్ ☐
స్టూడెంట్ ☐

**సెక్స్:**

స్త్రీ ☐
పురుషుడు ☐

విద్యార్హతలు:

అండర్ గ్రాడ్యుయేషన్ ☐
గ్రాడ్యుయేషన్ ☐
పోస్టుగ్రాడ్యుయేషన్ ☐

**వృత్తి:**

ఉపాధ్యాయుడు (ప్రయివేటు) ☐
ఉపాధ్యాయుడు (ప్రభుత్వ) ☐
ఇతర ఉద్యోగాలు ☐
బిజినెస్ ☐

పేరు: ____________________

అడ్రస్సు: ____________________

____________________

పిన్ నెంబర్: ____________________

ఫోన్ నెంబర్: ____________________

డీడీ/చెక్ నెంబర్: ____________________

బ్యాంకు: ____________________

తేదీ: ____________________

# స్వీయ మార్గదర్శక అభ్యసనం



విద్యార్థి తనకు తానుగా అభ్యసించి అభ్యసన ఫలితాలను పొందాలనేదే విద్య అంతిమ లక్ష్యం. గురుశిష్య పరంపర ప్రారంభమైన అనేక శతాబ్దాల కాలం క్రితం ఇదే భావనతో ఉపాధ్యాయుడు, విద్యార్థికి ఒక మార్గదర్శకునిగా నిలుస్తూ, స్వీయ అభ్యసనకు మార్గదర్శనం చేసేవాడు. అయితే మారుతున్న కాలానికి తగ్గట్టుగా ఊహించని విధంగా ప్రపంచవ్యాప్తంగా ఉన్న అన్ని పాఠశాల్లోనూ ఉపాధ్యాయుని ఆధారిత విద్య నేడు కొనసాగుతోంది. మల్టీ గ్రేడ్ క్లాసులకు బోధన అనివార్యమైన నేటితరంలో మళ్ళీ శతాబ్దాల కాలం నాటి స్వీయ మార్గదర్శక అభ్యసన విధానం చక్కటి ఆదరణ పొందుతోంది.

స్వీయ మార్గదర్శక అధ్యయనానికి ఎంతో ఘనమైన చరిత్ర ఉంది. సోక్రటీస్, ప్లేటో, అరిస్టాటిల్ వంటి గ్రీకు తత్త్వవేత్తల జీవితాల్లో స్వీయ మార్గదర్శక అభ్యసన ఒక ముఖ్యపాత్ర పోషించింది. అలెగ్జాండర్, సీజర్ వంటి యోధానుయోధులు కూడా స్వీయ మార్గదర్శక విధానంలో అభ్యసించిన వారే. ప్రాచీన భారతీయ సంస్కృతి మూలాల్లోనూ గురు పర్యవేక్షణలో సాగే స్వీయ మార్గదర్శక అభ్యసనను చూడవచ్చు. అమెరికా, యూరోప్‌ల్లో ఇది సుమారు 200 సంవత్సరాల క్రితం వేళ్ళూనుకుంది.



## సిద్ధాంతపర నేపథ్యం

స్వీయ మార్గదర్శక అభ్యసనం అనేది అత్యంత క్లిష్టమైన బోధన, అభ్యసన విధానాల్లో ఒకటి. మల్టీగ్రేడ్ విద్యాభ్యాసం సాగే స్కూళ్ళలో దీన్ని విస్తృతంగా ఉపయోగించే అవకాశాలుంటాయి. ప్రతి విద్యార్థి వ్యక్తిగత అవసరాలకనుగుణంగా బోధనా కార్యక్రమాన్ని సర్దుబాటు చేయడం అనేది ఎంతో లాభదాయకమైనది, అదే సమయంలో ఎంతో క్లిష్టమైనది కూడా. ఈ దిశగా ఉపాధ్యాయుడు ఎంతగానో శ్రమించాల్సి ఉంటుంది. ఇక విద్యార్థికి సైతం సవాల్ విసిరేదిగా ఉంటుంది. విద్యా లక్ష్యాలను చేరుకునే పథాన్ని తప్పకుండా, విద్యార్థి తన అభ్యసనకు బాధ్యత వహించే విద్యార్థి తన అభ్యసనకు బాధ్యత వహిస్తూ, అదే సమయంలో విద్యా లక్ష్యాల నుంచి పక్కకు తొలగకుండాను, ఆ లక్ష్యాలను చేరుకోవడంలో విద్యార్థి విఫలం కాకుండా ఉండే పరిస్థితులను ఉపాధ్యాయుడు సృష్టించాల్సి ఉంటుంది.

వయోజనుల విద్య, దీర్ఘకాలిక అభ్యసన రంగాల్లో స్వీయ మార్గదర్శక అభ్యసనకు సంబంధించి విస్తృతంగా పరిశోధనలు జరిగాయి, అయితే గడిచిన రెండు దశాబ్దాల్లో ప్రాథమిక, మాధ్యమిక విద్యారంగంలోనూ దీనిపై పరిశోధనలు ముమ్మరమయ్యాయి. నిర్మాణాత్మక స్వీయ మార్గదర్శక విధానం ద్వారా విద్యార్థులు ఎంతగానో లాభపడతారని అధ్యయన పరిశోధనలు రుజువు చేశాయి. సింగిల్ గ్రేడ్ క్లాస్‌రూమ్‌లో విభిన్న అభ్యసన స్థాయిలు, విభిన్న అవసరాలున్న విద్యార్థులుంటారు. మల్టీగ్రేడ్ క్లాసులో ఉండే విద్యార్థుల అవసరాలు నైపుణ్యాల కంటే ఇవి ఎంతో భిన్నమైనవి. అయినప్పటికీ మోనోగ్రేడ్ స్కూళ్ళలోనూ ఈ విధానం ఎంతో ఉపయుక్తమైనదని పరిశోధనల్లో తేలింది.

## స్వీయమార్గదర్శక అభ్యసన అమలు

స్వీయమార్గదర్శక అభ్యసన దిశగా విద్యార్థులకు దిశానిర్దేశం చేయడమనేది టీచర్లకు ఎంతో సవాళ్ళతో కూడుకున్న అంశం. తరగతి గది గురించి, తరగతి గదిలో విద్యార్థుల పట్ల, వారి బోధనకు సంబంధించి సాధారణంగా ఉండే అభిప్రాయ దృక్పధాన్ని మార్చుకోవాలి. ఉపాధ్యాయులు మరింత ఓపెన్ మైండ్‌గా ఉండి, ప్లానింగ్, టీచింగ్ కార్యకలాపాల అమలు విషయంలో కాస్తంత సరళంగా ఉండాలి, బాధ్యతలు విద్యార్థులకు అప్పగించేందుకు అదేవిధంగా తమ విద్యార్థులపై నమ్మకాన్ని ఉంచాలి.

ఈ విధానాన్ని సింగిల్ గ్రేడ్ లేదా మల్టీ గ్రేడ్ క్లాసుల్లో అమలుచేసే ముందుగా ఉపాధ్యాయుడు తన తరగతి గదిలో ఉన్న విద్యార్థుల ప్రవర్తనా లక్షణాలను గమనించాల్సి ఉంటుంది. ఈ ప్రవర్తనా లక్షణాలు రెండు రకాలు. ఒకటి జ్ఞాన సంబంధమైనది, ఇక రెండోది విద్యార్థుల సాధారణ ప్రవర్తన. సమగ్రత, స్వీయ పర్యవేక్షణ, స్వీయ ప్రశ్నా దృక్పథం, పరీక్షించే యంత్రాంగాలు, అవసరమైన సమాచారాన్ని పొందడం, విస్తరించే నైపుణ్యం, జ్ఞానాన్ని సమీకృతం చేయడం వంటివి జ్ఞాన సంబంధ అంశాలను తెలియజేస్తాయి. విద్యార్థులు తమ సమయాన్ని అదేవిధంగా తరగతి గదిలో వనరులకు ఎలా నిర్వహిస్తున్నారు, తమ పనిని, సబ్జెక్టు అసైన్‌మెంట్లను ఎంత క్రమబద్ధంగా నిర్వహిస్తున్నారనేది సాధారణ ప్రవర్తన కిందకు వస్తుంది.





### స్వీయ మార్గదర్శక అభ్యసన తరగతి గది : జ్ఞాన సంబంధ కార్యకలాపాలు

| కేటగిరీ | కార్యకలాపాల ఉదాహరణలు |
|---|---|
| ఎంపిక | అవసరమైన సమాచారాన్ని కనుగొనడం పనికి రాని సమాచారాన్ని తిరస్కరించడం, నోట్స్ తీసుకోవడం, ముఖ్యమైన ఆలోచనల్ని హైలెట్ చేయడం |
| అవగాహన | మెటీరియల్ పూర్వావలోకనం, సందర్భానికి తగ్గట్టుగా సమాచారాన్ని ఉపయోగించడం, వనరులు, రిఫరెన్సులను సంప్రదించడం |
| జ్ఞాపకశక్తిని పెంపొందించుకోవడం | మెటీరియల్ సమీక్షించడం, జ్ఞాపక పరీక్షలకు, స్వీయ పరీక్షలకు తగిన అధ్యయన వ్యూహాలను కనిపెట్టడం |
| విస్తృతి | స్వీయ ప్రశ్నా దృక్పథం, ఊహాత్మక రూపకాలు, సారూప్యాలు |
| ఇంటిగ్రేషన్ | మెటీరియల్‌కు స్వంతంగా నోట్స్ రాసుకోవడం, ఉపకరణాలను సమర్థవంతంగా ఉపయోగించుకోవడం, సరైన పరిజ్ఞానాన్ని ఉపయోగించుకోవడం అవసరం. పరిధుల మించిన సమాధానాలు నేర్చుకున్న విషయాలను గుర్తించడం వ్యక్తిగత బలాలు, బలహీనతలు |

| | |
|---|---|
| టైమ్ మేనేజ్‌మెంట్ | కాల అవసరాలను గుర్తించడం, గడిచిపోయిన సమయాన్ని గుర్తించడం, సరైన సమయాన్ని కేటాయించడం, పనులకు తగ్గట్టుగా సమయాన్ని కేటాయించడం |
| యత్న నిర్వహణ | ఉత్పాదక అభ్యసన వాతావరణాన్ని సృష్టించడం, అభ్యసన లక్ష్యాలను ఏర్పరుచుకోవడం, వాటిని సాధించడం, చొరవ తీసుకోవడం, వస్తువులను వెతకడం, శ్రద్ధ పెట్టడం |
| స్ఫూర్తి | శ్రద్ధను పర్యవేక్షించడం, అభ్యసన అలవాట్ల బలాలు, బలహీనతలను అంచనా వేయడం |

జ్ఞాన, సాధారణ ప్రవర్తన నియమాలకు సంబంధించి పైన పేర్కొన్న లక్షణాలను అందిపుచ్చుకోగల నైపుణ్యమున్న విద్యార్థులను స్వీయ మార్గదర్శక అభ్యసనకు దిశానిర్దేశం చేయడానికి ఉపాధ్యాయుడు ఎంచుకోవచ్చు. స్వీయమార్గదర్శక అభ్యసన విద్యార్థి తరగతి గదిలో మంచి విద్యార్థిగా పేరుతెచ్చుకున్న వారే ఉంటారని చెప్పవచ్చు. మీ తరగతి గదిలో పైన పేర్కొన్న లక్షణాలు లేని విద్యార్థుల్లో సైతం అటువంటి లక్షణాలు పెంపొందే విధంగా స్ఫూర్తిదాయకంగా నిలవడం ద్వారా వారిని కూడా క్రమేపీ స్వీయ మార్గదర్శక అభ్యసన చట్రంలోకి తీసుకురావొచ్చు.

స్వీయ మార్గదర్శక అభ్యసన వల్ల ఆ విధానంలో అభ్యసిస్తున్న వారికేగాకుండా తరగతి గదిలో ఉన్న విద్యార్థులందరికీ కూడా ఎంతో లాభదాయకంగా ఉంటుంది. తరగతి గదిలో స్వీయ మార్గదర్శక విద్యార్థులు ఉండడం ద్వారా అదనపు మార్గదర్శనంతోపాటు, మెరుగైన పర్యవేక్షణ అవసరమైన విద్యార్థులపై దృష్టి సారించడానికి ఎక్కువగా అవకాశం ఏర్పడుతుంది. అభ్యసన సమయాన్ని పున:పంపిణీ చేయడం వల్ల చివరికి తరగతి గది మొత్తం లబ్ధిని పొందుతుంది.

**స్వీయ మార్గదర్శక అభ్యసనను, విద్యార్థి స్ఫూర్తిని పెంపొందించే అంశాలు**

- నిర్దిష్ట లక్ష్యాలను సాధించిన విద్యార్థులకు బహుమతులు, పురస్కారాలు ఇవ్వడం లేదా అభినందించడం
- లక్ష్యాలు, రివార్డ్స్ విధానం తరగతి గదికి తెలియజెప్పడం
- తరచుగా, తక్షణం లేదా అవసరమైనప్పుడు ఫీడ్‌బ్యాక్ ఇవ్వడం
- వ్యక్తిగతంగా, ఎలాంటి పోటీలేని వాతావరణాన్ని సృష్టించడం
- నిర్దిష్ట లక్ష్యాల ఆధారంగా మూల్యాంకనం చేయడం
- బహిరంగంగా కాకుండా వ్యక్తిగతంగా మూల్యాంకనం చేయడం
- సామర్థ్యం ఆధారంగా కాకుండా చేసిన శ్రమను అభినందించడం
- మరింత స్వతంత్రంగా వ్యవహరించేందుకు అవకాశం కల్పించడం

**పూర్తిగా విద్యార్థి బాధ్యుడు కాదు**

స్వీయ మార్గదర్శక అభ్యసనం అంటే అభ్యసనకు సంబంధించి విద్యార్థి నూటికి నూరుశాతం బాధ్యత వహిస్తాడని అర్థంకాదు. టీచర్ నిరంతరం విద్యార్థులకు మార్గదర్శనం చేస్తాడు, వాటి అవసరమైన మార్పులుచేర్పులు చేపడుతుండాలి. విద్యార్థులకు ఏర్పరిచే విద్యార్థి లక్ష్యాలు నిర్మాణాత్మకంగా, సవాళ్ళతో కూడుకున్నవిగా ఉండాలి, అయితే విద్యార్థి సాధించగలవాటిగా వీటిని సెట్ చేయాలి. అభ్యసనలో భాగంగా ఉపాధ్యాయులు ఎప్పుడు అవసరమైతే అప్పుడు తమకు అందుబాటులో ఉంటారన్న భావన విద్యార్థుల్లో కలిగించాలి. విద్యార్థులు స్వీయ నిర్దేశక విధానాన్ని అనుసరించడం అంతతేలికైన విషయం కాదు. కనుక వారు దీనిపట్ల అనాసక్తి లేదా చిరాకు కలగకుండా చూడడం కూడా క్లిష్టమైన అంశమే.



### ఈ విధానం వల్ల లాభాలు

విద్యార్థులు చొరవ తీసుకుని అభ్యసనకు సంబంధించి తమ స్వంత లక్ష్యాలను ఏర్పరుచుకునేందుకు, స్వీయ ఆదేశాలను పాటించేందుకు, లక్ష్యాలను చేరుకునేందుకు తామే వ్యూహరచన చేసుకోవడాన్ని స్వీయ మార్గదర్శక విధానం ప్రోత్సహిస్తుంది.

పై లక్షణాలు విద్యార్థులు అభ్యసన ప్రక్రియలో మరింత ఎక్కువగా నిమగ్నం కావడానికి స్ఫూర్తినిస్తాయి. తద్వారా వారు తరగతి గదిలో మరింత నైపుణ్యం కలిగినవారిగా నిలుస్తారు. విద్యా సంబంధమైన పనుల పట్ల మరింత బాధ్యతాయుతంగా ఉంటారు. లక్ష్యాల్ని సాధించడంలో అంకితభావం కనబరుస్తారు. కొత్త విషయాలను తెలుసుకునేందుకు వాటిని ప్రయత్నించేందుకు ఆసక్తి కనబరుస్తారు.

స్వీయ మార్గదర్శక అభ్యసన విధానం సాధన చేస్తున్న విద్యార్థి ఓపెన్ మైండ్‌తో ఉంటాడు. తమ లక్ష్యాలను సాధించాలన్న దృక్పథాన్ని కలిగి ఉంటారు. తమ స్వంత అభ్యసన పట్ల బడిలోను, ఇంటివద్ద విశ్వాసాన్ని పాదుగొల్పుతారు.

విద్యార్థి కొత్త నైపుణ్యాలను, వ్యూహాలను అభివృద్ధి చేసుకునేందుకు స్వీయ మార్గదర్శక అభ్యసన అవకాశం కల్పిస్తుంది. మరింత నైపుణ్యాన్ని అందిపుచ్చుకోవడానికి, బాధ్యతాయుతంగా ప్రవర్తించడానికి, బడిలోను, బడివెలుపల సామాజిక ప్రవర్తనను మెరుగుపరుచుకోవడానికి ఇవి సాయపడతాయి.

స్వీయ మార్గదర్శక అభ్యసనలో మరింత సమర్థవంతమైన అభ్యసన వాతావరణాన్ని సృష్టించినప్పుడు విద్యార్థుల అభ్యసన సమయం మరింత పెరగడం, దాని ఫలితంగా విద్యార్థులు మరింత ఎక్కువ విజయాలు సాధించినట్లుగా పరిశోధనలు రుజువు చేస్తున్నాయి.

### వ్యక్తిగత లాభాలు

విద్యార్థి తనకనుకూలమైన సమయంలో, అభ్యసించగలుగుతాడు తన అభ్యసన వేగానికి అనుగుణంగా అభ్యసన కొనసాగిస్తాడు.
మిగిలిన వారి కంటే ఎక్కువ వేగంగా అభ్యసిస్తాడు.
స్వంత అభ్యసన విధానాన్ని అనుసరిస్తాడు.
అభ్యసకుడు తన పురోగతిని స్వయంగా గమనించగలుగుతాడు.
అభ్యసకుడు తన పురోగతిని పరీక్షించుకునేందుకు అవకాశం ఉంటుంది.



### తరగతి గదిలో ఎదురయ్యే సవాళ్ళు

స్వీయమార్గదర్శక అభ్యసన విధానం అటు టీచర్లకు ఇటు విద్యార్థులకు లాభదాయకమైనదని గుర్తించినప్పటికీ, ఉపాధ్యాయులు తమ అభివృద్ధికి ఏం చేయాలన్న సందిగ్ధత ఏర్పడుతుంది. విద్యార్థులు స్వతంత్రంగా పనిచేయడానికి అవసరమైన నైపుణ్యాలను పొందేవిధంగా అసైన్‌మెంట్లు, కార్యకలాపాల రూపకల్పనలో చేయడంలో ఇబ్బందులు ఎదుర్కొనాల్సి వస్తుంది. స్వీయ మార్గదర్శక అభ్యసన నైపుణ్యం అందిపుచ్చుకునేందుకు ఎలాంటి బోధనా విధానాలు వినియోగించాలో తెలియక ఇక్కట్లు పడుతుంటారు.

దీంతోపాటు స్వీయ మార్గదర్శక అభ్యసన విద్యార్థి ప్రవర్తనను పెంపొందించే సలహాలు, సూచనలు ఇవ్వడానికి ముందు విద్యార్థి మానసిక పరిపక్వత, అభివృద్ధిని తెలుసుకోవాలి. విద్యార్థుల నైపుణ్యాలపై ఉపాధ్యాయుల ఆకాంక్షలు అన్ని వ్యతిరేక అంశాలనూ పరిగణనలోకి తీసుకుని గరిష్టంగా లేదా కనిష్టంగా ఉండాలి. విద్యాపరంగా అత్యంత సంక్లిష్టత అంశాల కారణంగా విద్యార్థులు ప్రాథమిక దశలో స్వీయ మార్గదర్శక అభ్యసనను వ్యతిరేకిస్తారు. తరచుగా ఒకే పని చేయాల్సి రావడం, వారు చేసే పనులు వారి నైపుణ్యాలకు సంబంధం లేని పనులు చేయాల్సి వచ్చినప్పుడు పిల్లలకు విసుగు కలుగుతుంది, ఆ పనుల్ని చేయడానికి ఇష్టపడరు. ఒకవేళ చేయాల్సొచ్చినా అన్యమనస్కంగా చేస్తారు. స్వీయ అభ్యసన కార్యకలాపాలను విద్యార్థులకు కేటాయించేటప్పుడు వారి వయస్సు, వారి పరిణితి ఇంకా వారి సామర్థ్యాన్ని పరిగణనలోకి తీసుకుని ఎంతో జాగ్రత్త వహించాల్సి ఉంటుంది.

# మారదాం...
# మార్పును స్వాగతిద్దాం...
# మరింత మార్చుదాం

సమాజం, సమాజంలోని వ్యవస్థలు నిత్యం మార్పునకు గురవుతుంటాయి. ఈ మార్పే సమాజం, సమాజంలో వ్యవస్థల మనుగడకు కారణమవుతుంది. సమాజాన్ని, సమాజంలో వ్యవస్థల మార్పునకు దిశానిర్దేశం చేసే ఉపాధ్యాయుడు సమాజంలోని మార్పులకు అనుగుణంగా తనను తాను మార్చుకుని ముందుకు సాగుతున్నాడా అంటే లేదనే సమాధానం వస్తుంది. అందుకే సమాజంలో ఉపాధ్యాయుని గత స్థానం నేడు నెమ్మది నెమ్మదిగా జరిగిపోతోంది. సమాజానికి, సమాజ దృక్పథానికి, విద్యార్థి, విద్యార్థి ఆకాంక్షలకు దూరంగా ఉపాధ్యాయుడు కరిక్యులం, టెస్ట్ పుస్తకాలు, పరీక్షల వలయంలో మొహమాటం కొద్దీ తిరిగేస్తున్నాడు. అందుకే ఉపాధ్యాయుడు మార్పును స్వాగతించే రీతిలో మారాల్సి ఉంది. అందుకే ఒక్కసారి ఆలోచించండి.





అప్పుడే పుట్టిన నవజాత శిశువు, ఎప్పుడు మాట్లాడతాడా, ఎప్పుడు తప్పటడుగులు వేస్తాడా అని మనమందరం ఎదురు చూస్తాం. బిడ్డనోటి నుంచి వచ్చే ప్రతి మాటా, మన ఇంటిల్లపాది మదిలో ఆనందాన్ని నింపుతుంది. ఇంకా మాటలు మాట్లాడాలని ఉత్సాహపరుస్తాం. మాటలు మాట్లాడేందుకు పదాలు అందిస్తాం. వారి పరిభాషలోకి మన భాష మారిపోతుంది. ఇదంతా కూడా బిడ్డ బడి గడప తొక్కేవరకే. క్రమశిక్షణ పేరిట, మీరు చెప్పాలనుకుంటున్న పాఠాన్ని సజావుగా చెప్పడానికి ఏ మాత్రమూ ఆటంకం ఏర్పడకూడదని పిల్లల నోటిపై వేలు వేయిస్తారు.

భావ ప్రకటనా స్వేచ్ఛ, చర్చకు దారితీస్తుంది. చర్చ అర్థవంతమైన విజ్ఞానాన్ని అందిస్తుంది. అందుకే తరగతి గదిలో విద్యార్థి మాట్లాడేందుకు అవకాశమిద్దాం. ఏది తప్పు, ఏది ఒప్పు అనే విచక్షణను పక్కన పెడదాం. ఒప్పులను విశ్లేషించి, మరింత సమాచారం అందిద్దాం. అదేవిధంగా తప్పుల్ని విశ్లేషించి, తప్పుల్ని ఒప్పులుగా మార్చుదాం.

## తరగతి గది

ఉపాధ్యాయుడు జ్ఞాన సంపన్నుడని, జ్ఞానహీనులైన విద్యార్థులు ఆ ఉపాధ్యాయుడి నుంచి జ్ఞానాన్ని అందిపుచ్చుకునే వేదికే తరగతి గది అని చాందసవాద నిర్వచనాలు తరగతి గదికి ఇవ్వబడ్డాయి. విద్యార్థుల సర్వతోముఖాభివృద్ధికి బాటలు పరిచే తరగతి గదిలో ఉపాధ్యాయుడే సర్వాధికారి. దాదాపుగా ఉపాధ్యాయుడు చెప్పిందే చెల్లుబాటు అవుతుంది. విద్యార్థి చెప్పినట్లుగా నడుచుకుంటే తరువాత విద్యార్థులు తమమాట వినకపోవచ్చునే భావనలో చాలామంది ఉపాధ్యాయులు ఉంటారు. దీంతో విద్యార్థి ఆకాంక్షలకు భిన్నంగా ఉపాధ్యాయుడు తాను ఏదైతే చెప్పాలనుకుంటాడో, ఏదైతే విద్యార్థులకు అవసరమైనది భావిస్తాడో వాటినే బోధిస్తాడు తప్ప, విద్యార్థి నిజంగా ఏది కోరుకుంటున్నాడో, విద్యార్థి అవసరాలను తరగతి గది తీర్చిందా అని తెలుసుకునే యత్నం చేయడు. ఏతావాతా పిల్లవాడి ఆకాంక్షలకు అవకాశం కల్పించాలన్నా, ఏ మాత్రం వెసులుబాటు లభించని సిలబస్ షెడ్యూల్ ఉపాధ్యాయునికి తరగతి గదిపై అధికారాన్ని సడలించడానికి అవకాశం కల్పించదు.

మాస్టారు, పిల్లవాడికి మాట్లాడే స్వేచ్ఛలేకుండా చేయడం, ఆపైన వారి మనసెరిగి బోధన సాగించడం వల్ల ఒనగూరే ప్రయోజనాలేమి ఉండవు. అన్నింటికీ మించి, ఇది పిల్లల సామాజిక ఎదుగుదలపై తీవ్రమైన ప్రభావం చూపుతుంది. ఆత్మవిశ్వాసం లోపిస్తుంది. స్వతంత్రను కోరుకోరు. ప్రతి విషయానికీ పక్కవారిపై ఆధారపడే స్వభావాన్ని అభివృద్ధి చేసుకుంటారు. విపత్కర పరిస్థితుల్లో నిర్ణయాలు తీసుకోలేకపోతారు. అందుకే తరగతి గదిలో ఉపాధ్యాయుని ఆధిపత్యానికి స్వస్తి పలుకుదాం. తెలియని విషయాలను తెలియజెప్పే పాత్రనుంచి, తెలియని విషయాలను తెలియజెప్పే ఒక మార్గదర్శకునిగా మారదాం.



బడి సమాజానికి గవాక్షంలా నిలుస్తూ... బడిలో నేర్చుకున్న విజ్ఞానాన్ని తను నివసించే సమాజ పరిణామాలకు అనుగుణంగా అనువర్తించుకునేందుకు దోహదపడేదే అర్థవంతమైన విద్య అని అంటారు. తరాల క్రమంలో బడికి, సమాజానికి మధ్య సరైన లంగరు పడలేదనే చెప్పాలి. బడి తోవ బడిది... సమాజం తోవ సమాజానిది. బడి సమాజంలో జీవించడానికి అవసరమైన రుజువర్తన, నైతిక విలువలపై దృష్టి సారిస్తుంది. ఇందులో ఎటువంటి సందేహమూ లేదు. అయితే బడిలో నేర్చుకున్న విజ్ఞానాన్ని బదలాయింపు చేయడం ద్వారా నేరుగా తనకు తాను ఉపాధిని పొందలేని పరిస్థితి తలెత్తుతోంది. ఇది బడిలో నేర్పే జీవక నైపుణ్యాలను, ఉపాధ్యాయుడు నేర్పే మంచిమాటలను తుంగలోకి తొక్కి తమమార్గంలో తాము సాగిపోయేందుకు అంటే నైతిక క్షీణతకు దారితీస్తోందని చెప్పవచ్చు.

ఇక బడిలో నేర్పే పాఠాల విషయంలో విద్యార్థికి ఎప్పుడూ సందేహం. ఈ పాఠాలన్నీ నిత్య జీవితంలో ఎక్కడ ఉపయోగపడతాయో తెలియని పరిస్థితి. రెండో ప్రపంచయుద్ధం గురించి తెలుసుకోవడం లేదా బీజ గణితం, అంక గణితం, లేదా మరో సైన్సు పాఠాలు నేర్చుకోవడం వల్ల అవి తన భావి జీవితానికి ఏవిధంగా ఉపయోగపడతాయో విద్యార్థి తెలుసుకోలేని పరిస్థితి. ఆ విషయాలను విడమర్చి చెప్పలేని స్థితిలో బడి ఉంది. ఎక్కువ మంది విద్యార్థులు ఇలాంటి నిర్లిప్తతతోనే బడికి దూరం అవుతున్నారు. ఏదైనా చిన్నపాటి వృత్తిలో ప్రావీణ్యం సంపాదిస్తే చాలు భావి జీవితంలో చక్కటి సంపాదన లభిస్తుందనే ఆలోచనలో వీరుంటారు.

అందుకే, బడికి, సమాజానికి మధ్య వారధిని నిర్మిద్దాం. తరగతి గదిలో బోధించే ప్రతి అంశాన్నీ సమాజానికి అన్వయిద్దాం. నిత్య జీవిత ఉదాహరణలతో తరగతి గదిని బోధనను అర్థవంతంగా మార్చుదాం.





## సబ్జెక్టులు క్లిష్టమైనవి




ఆల్జీబ్రా చాలా క్లిష్టమైన సబ్జెక్టు... ఒక పట్టాన అంత తేలికగా కాదు... సోషల్ ఏముందని... పేజీలు నింపేస్తే చాలు... ఇక హిందీ అంటారా... నాలుగు బిట్లు ముక్కున పెట్టుకుంటే చాలు... పాసైపోతారు... అంటూ కొంతమంది ఉపాధ్యాయులు తరగతి గదిలో కొన్ని సబ్జెక్టులు ఎంతో క్లిష్టమైన భావన కలిగిస్తారు, మరికొన్ని సబ్జెక్టుల విషయంలో చులకన భావన కలిగిస్తారు. ఈ భావన తమ మదిలో బలంగా నాటుకుపోయిన విద్యార్థులు ఆయా సబ్జెక్టుల విషయంలో అదేవిధంగా వ్యవహరిస్తుంటారు. కష్టమైనదని టీచర్ అన్న ప్రతి విషయాన్నీ కష్టమైనదిగానే భావిస్తారు. వారి భావి జీవితంలోనూ ఆ సబ్జెక్టుల పట్ల అదే రకమైన భావనతో ఉంటారు. ఇక క్లిష్టమైన భావన ఉన్న సబ్జెక్టులను బోధించే ఉపాధ్యాయులు కఠిన వైఖరిని అవలంబించే వారైతే కొన్ని సందర్భాల్లో విద్యార్థి బడి నుంచి దూరంగా జరిగిపోవడానికి ప్రయత్నిస్తాడు.

వాస్తవానికి ఒక సబ్జెక్టు క్లిష్టమైనది కాదు, మరో సబ్జెక్టు తేలికైనది కాదు. ప్రతి సబ్జెక్టూ దాని ప్రత్యేకతను అది కలిగి ఉంటుంది. కొన్ని సబ్జెక్టులను నేర్చుకోవడానికి తక్కువగా శ్రమించాలి. మరికొన్ని సబ్జెక్టులు నేర్చుకోవడానికి ఎక్కువగా శ్రమించాల్సి ఉంటుంది. అంతేతప్ప పెద్దగా భేదభావం ఉండదు. అన్నింటికీ మించి విద్యార్థుల్లో సబ్జెక్టు మీద ప్రేమను పెంచగలిగితే... విద్యార్థి ఆ సబ్జెక్టును నేర్చుకోవడంలో ఎలాంటి విముఖతనూ చూపించడు. అందుకే తరగతి గదిలో విద్యార్థికి ప్రతి సబ్జెక్టుపైనా ప్రేమను పెంచుదాం.



తండ్రి: చింటూ... ఏడవద్దన్నానా, ఇలాగే ఏడ్చాడుంటే కుక్కకు పట్టిస్తా!

తల్లి: తీసుకెళ్లండి... వాడు ఏడుస్తున్నది కుక్క కావాలనే!



పెద్ద దోమ: అదిగో! ఆ ఎర్ర చొక్కావాడున్నాడే, వాడ్ని బాగా కుట్టేసిరా!

చిన్నదోమ: మనుషులందరి రక్తం ఒకటేగా, వాడినే ఎందుకు కుట్టాలి?

పెద్దదోమ: వాడు మన శత్రువు, దోమ తెరల్ని అమ్ముతున్నాడు...!

### ప్రతి మార్పునూ స్వాగతిద్దాం

బోధనలో అనేక మార్పులు చోటు చేసుకుంటున్నాయి. ఆడియో, వీడియో, ఇంటర్నెట్ ఇలా అనేక సాంకేతిక అంశాలు చొచ్చుకొస్తున్నాయి. అయితే చాలామంది ఉపాధ్యాయులు ఈ మార్పును స్వాగతించరు. మార్పును ఆకళింపు చేసుకోవడానికి సుముఖంగా లేకపోవడం వల్ల, ఆ మార్పును పూర్తిగా ఆకళింపు చేసుకోలేకపోవడం వల్ల ఆ మార్పును పెడపకాలపు బుద్ధులుగా అభివర్ణిస్తారు. మార్పును ప్రతిఘటించేందుకు నేటి తరాన్ని, నాటి తరాన్ని నిరంతరం పోలుస్తూ ఉంటారు. నాటి తరం లక్షణాలు ఇప్పటి విద్యార్థుల్లో కనిపించలేదని ఆవేదన వ్యక్తం చేస్తారు. కొంతమంది ఉపాధ్యాయులు వ్యవస్థ పూరిగా కలుషితమైపోయిందని ఆవేదన చెందుతూ తమ వృత్తిపైన తామే విరక్తి పెంచుకుంటారు. ఒక స్థాయి అనుభవం సంపాదించిన తరువాత బోధనకు సంబంధించి తాను పెద్దగా మెరుగుపరుచుకోవాల్సిన అవసరం లేదని కూడా కొంతమంది ఉపాధ్యాయులు భావిస్తుంటారు. బోధనాపరమైన మెరుగుదల లేకపోవడం వల్ల విద్యార్థులు సంధించే కొన్ని సందేహాలకు సమాధానాలు ఇవ్వలేక, వారిపై నిరంకుశ ధోరణి కనబరుస్తారు. దీంతో విద్యార్థుల్లో ప్రశ్నించే గుణం పోతుంది.

మార్పు అనివార్యమని... మార్పే మనల్ని నవచైతన్యంగా ఉంచుతుందని... కథనం మొదట్లోనే ప్రస్తావించుకున్నాం. ఈ మార్పుల్లో కొన్ని మంచి మార్పులు, కొన్ని చెడ్డ మార్పులు ఉండవచ్చు. మంచి మార్పులను తరగతి గదిలోకి స్వాగతిద్దాం. ఇక బోధనలో నిత్య నూతనత్వం తీసుకురావడానికి నిత్య అభ్యసకులుగా మారదాం. సరికొత్త ప్రక్రియలను బోధనలో జోడించి, అభ్యసనను అర్థవంతంగా మార్చుదాం.



తరగతి గదిలో ఎప్పుడూ కూడా తెలివైన విద్యార్థులు, తెలివితక్కువ విద్యార్థులు అనే విభజన రేఖ స్పష్టంగా కనిపిస్తుంది. తరగతి గదిలో జరిగే పరీక్షలు ఈ విభజన రేఖకు ప్రధాన అంశీభూతం అవుతుంది. చాలామంది ఉపాధ్యాయులు ఇటువంటి విభజనను ప్రోత్సహిస్తుంటారు. ఈ తెలివైన విద్యార్థులనే ఎక్కువగా దృష్టిలో పెట్టుకొని బోధన సాగిస్తుంటారు. మార్కులపరంగా వెనకబడినవారిని, ఉపాధ్యాయుడు చెప్పే పాఠ్యాంశాలను అందుకోలేని విద్యార్థుల్ని తెలివితక్కువగా పరిగణిస్తుంటారు. ఇటువంటి విద్యార్థులకు తరగతి గదిలో ఉండే హక్కులు పూర్తిగా నిరాకరించబడతాయి. దాదాపుగా పిల్లవాడి లోపాల్ని ఎత్తిచూపించే ప్రక్రియ ఎక్కువగా ఉంటుంది తప్ప తరుణోపాయాలు సూచించే ఉపాధ్యాయుల సంఖ్య తక్కువగా ఉంటుంది.

ఒక వ్యవస్థలో లోపాలున్నట్లయితే ఆ వ్యవస్థను రూపొందించిన వారిలో లోపాలున్నాయని అంటారు. కనుక తరగతి గదిలో తెలివితక్కువ విద్యార్థులు ఉన్నట్లయితే, విద్యార్థులకు విద్యాగంధం అందించాలన్న విద్యా వ్యవస్థలోనూ, అదేవిధంగా ఆ వ్యవస్థలో భాగమైన మన వైఫల్యమే దానికి కారణమని అన్వయించుకోవాల్సి వస్తుంది. అందుకే తరగతి గదిలో అటువంటి విభజనను చెరిపేద్దాం. విద్యార్థుల ఆకాంక్షలు తెలుసుకుందాం, వారి అభిరుచులేంటో తెలుసుకుందాం. వారికి ఎలాంటి అవసరాలుంటాయో... మనం ఎలాంటి సాయం అందించాలో విశ్లేషించుకుందాం. స్ఫూర్తి అనే చిన్న ఊతంతో గణితంలో వెనకబడిన విద్యార్థిలో మరో సబ్జెక్టులో నూటికి నూరుమార్కులు సాధించే విధంగా ముందుకు నడిపించవచ్చు.



డాక్టర్: ఈ కళ్లజోడు పెట్టుకుంటే దూరంగా వున్న వస్తువులు దగ్గరగా కనపడతాయి పాపా!

మున్ని: అయితే విజయవాడలో వున్న నాకు చార్మినార్ కనబడుతుందా?



బిచ్చగాడు: బాబూ! రెండు రూపాయిలు దానం చెయ్యండి, కడుపులో ఎలుకలు పరుగెడ్తున్నాయ్!

రాంబాబు: పోవయ్యా! రెండు రూపాయలకే ఎలుకల మందు వస్తుందా...!

# ఐడియా బాక్స్

మీ తరగతి గదిలో ఏమైనా మార్పులు లేదా మీ బోధనలో ఏదైనా మార్పులు విద్యార్థులు కోరుకుంటున్నా లేదా మీకు మాత్రమే చెప్పాలని అనుకుంటున్న విషయాన్ని మీతో మీ తరగతి విద్యార్థులు పంచుకునేందుకు ఒక్క చక్కటి ఐడియా. ఐడియా బాక్స్. దీన్ని మీ తరగతి గదిలో ఒక మూల ఉంచండి. ఎలాంటి అంశాలకు సంబంధించి మీరు పిల్లల నుంచి అభిప్రాయాలను నిర్మొహమాటంగా కోరుకుంటున్నారో చెబుతూ, వారు తమ అభిప్రాయాలను తెల్లకాగితంపై రాసి, అందులో వేయవచ్చని చెప్పండి. ఎవ్వరూ తమ పేర్లు, రోల్ నెంబర్లు రాయాల్సిన అవసరం లేదని స్పష్టం చేయండి. అప్పుడే మీ గురించి, మీ తరగతి గది గురించి, మీ బోధన గురించి విద్యార్థులు ఎంతో నిర్మొహమాటంగా తమ అభిప్రాయాలను వ్యక్తం చేయగలుగుతారు.

హోం వర్క్
ఛార్టు

నిజాయితీ

బహుమతులు

కోర్కెల
డెమో

ఫ్యాక్ట్ షీట్

డొనేషన్

క్రమశిక్షణ

## వివిధ రకాల పనుల్ని పరిచయం చేయడం

మీ తరగతి గదిలో ఉన్న విద్యార్థులకు వివిధ రకాల వృత్తులను పరిచయం చేయాలంటే, వారిని ఆయా పనులు జరిగే ప్రాంతాలకు తీసుకెళ్ళడం సర్వసాధారణం, అయితే అన్ని సందర్భాల్లోనూ ఇది సాధ్యం కాదు. కనుక ఆయా వృత్తులకు సంబంధించిన చిత్రా(ఫొటోగ్రాఫ్)లను సంపాదించి, వాటిని ఛార్ట్‌లపై అందంగా అలకరించి, విద్యార్థులకు పరిచయం చేయవచ్చు. ప్రాథమిక పాఠశాలల్లో చదివే విద్యార్థులకు వివిధ రకాల వృత్తులను పరిచయం చేయడానికి ఒక చక్కటి మార్గం ఇది. తద్వారా ఆయా వృత్తులకు సంబంధించి విద్యార్థులకు ప్రాథమిక అవగాహన ఏర్పడుతుంది. అదేవిధంగా తరువాత ఎప్పుడైనా అటువంటి వృత్తులు చేసేవారు తమకు కనిపిస్తే ఆ అనుభవాలను క్లాసుతో పంచుకోమని చెప్పండి.



## గిఫ్ట్‌బాక్స్



మార్కులు ఎక్కువ సాధించిన విద్యార్థులను, అదేవిధంగా పుట్టినరోజు సందర్భంలో తరగతి గదిలో మీ విద్యార్థులకు బహుమతులను అందించడం కోసం గిఫ్ట్ బాక్స్‌ను ఏర్పాటు చేయడం అనేది ఒక్క చక్కటి ఆలోచన. మీ తరగతి గదిలో ఎంతమంది విద్యార్థులున్నారు, అదేవిధంగా మిగిలిన సందర్భాల్లో ఎన్ని గిఫ్ట్‌లు, ఎంతమందికి ఇవ్వాలన్న విషయాన్ని నిర్ధారించుకుని, చిన్న మొత్తం ఖర్చు చేయడం ద్వారా విద్యార్థులకు, తరగతి గదికి ఉపయోగపడే వస్తువులను కొనుగోలు చేసి, ఒక చక్కటి గిఫ్ట్ బాక్స్‌లో వాటిని ఉంచండి. ఆయా సందర్భాల్లో విద్యార్థులను ఆ గిఫ్ట్‌బాక్స్ నుంచి ఒక్కొక్క గిఫ్ట్ తీసుకోమని చెప్పండి. ఇలా చేయడం ద్వారా విద్యార్థులు మీపై మరింత అభిమానంతో ఉంటారు.

## క్లాస్ జాబ్స్

తరగతి గదిలోని కార్యకలాపాల్లో విద్యార్థుల నిమగ్నతను పెంపొందించడానికి కొన్నిరకాల జాబ్స్‌ను ఏర్పాటుచేసి, ఆ ఉద్యోగాలు దొరకబుచ్చుకునేందుకు విద్యార్థుల మధ్య పోటీని పెంపొందించవచ్చు. అటువంటి ఉద్యోగాలు లభించాలంటే విద్యార్థులు అందిపుచ్చుకోవాల్సిన లక్షణాల గురించి తెలియజేయండి(సాధారణంగా ఇది ఒక మంచి అలవాటు లేదా ఒక మంచి పనిచేయడం లేదా చదువుపరంగా మరింత మెరుగైన ప్రతిభ కనబరచాలన్న నిబంధన పెట్టండి). క్లాస్‌రూమ్ మెటీరియల్(చాక్‌పీస్‌లు, డస్టర్లు కలిగి ఉండడం), హోంవర్క్‌ను పరిశీలించడం, ఛార్టులు, రికార్డులు సేకరించడం, క్లాస్‌లో ఆ రోజు వార్తలు చదవడం, వాతావరణ వివరాలు చెప్పడం, ఆరోజు చరిత్రలో చోటుచేసుకున్న ఘటనల్ని తరగతి గదిలో వివరించడం, క్లాసులో ప్రార్థన చేయించడం, ఉపాధ్యాయుని తరపున హాజరు తీసుకోవడం వంటి వృత్తులను విద్యార్థుల కోసం ఏర్పాటు చేయవచ్చు.



## క్లాస్ చెట్టు

క్లాసు మొత్తం మీద ఒక చెట్టును దత్తత తీసుకోవడం అనేది ఒక మంచి ఆలోచన. వీలునుబట్టి తరగతిలో ఉన్న విద్యార్థులను గ్రూపులుగా చేసి, ఒక్కొక్క గ్రూపునకు ఒక్క చెట్టును అప్పగించండి. ఎవరి చెట్టు బాగా ఎదుగుతుందో వారికి ఉచిత బహుమతులుంటాయని చెప్పండి. ఇది పిల్లల్లో పర్యావరణంపై స్పృహ పెంచడంతోపాటు, వారిలో పోటీ తత్త్వాన్ని పెంచుతుంది.ఈ చెట్టును స్కూలు ఆవరణలోనైనా పెంచవచ్చు లేదా సామాజిక ప్రదేశాల్లోనైనా, విద్యార్థుల ఇళ్ళవద్దనైనా పెంచవచ్చని చెప్పండి.

## నిజం చెప్పే ఛార్టు

తరగతి గదిలో విద్యార్థులతో నిజం చెప్పించేందుకు చేసే ప్రయత్నం ఇది. ఒక ఛార్టును తీసుకుని, దానిలో విద్యార్థుల పేర్లు ఒకవైపున, దానికి ఎదురుగా నెల మొత్తం తారీఖుల్ని వేయండి. పిల్లలు ఎప్పుడు అబద్ధమాడితే అప్పుడు నిజాయితీగా వచ్చి, ఆ ఛార్టులో సంతకం చేయండని చెప్పండి. విద్యార్థులు నిజాయితీగా లేకుండా ఉండి, విద్యార్థి అబద్ధమాడిన విషయాన్ని మీరు గుర్తిస్తే పనిష్మెంట్ ఉంటుందని చెప్పండి. ఇలా ఎన్నిసార్లు అబద్ధాలాడతారో వారికి నెల చివర్లో ఒక బహుమతి ఇవ్వండి. వీలైతే 'ఈ పిల్లవాడు అబద్ధం చెప్పడు' అనే బ్యాడ్జీని తరువాత నెలరోజుల కొరకు ఇవ్వండి. ఇటువంటి బ్యాడ్జీని చేజిక్కించుకునేందుకు విద్యార్థులు తప్పక పోటీపడతారు, అదేవిధంగా పిల్లలకు ఒక మంచి లక్షణం అలవాటు చేసినవారవుతారు.



### డొనేషన్ బాక్స్

విద్యార్థుల్లో దాతృత్వ గుణాన్ని పెంపొందించడానికి ఇది బాగా దోహదపడుతుంది. తరగతి గదిలో ఒక డొనేషన్ బాక్స్‌ను ఏర్పాటు చేయండి. పిల్లల ఇంటి వద్ద పనికి రాకుండా ఉన్నవి, పాత పుస్తకాలు, లేదా పాత బట్టలు వంటివాటిని అందులో వేయవచ్చని చెప్పండి. ఇలా రెండు, మూడు నెలలు పోగైన తరువాత వాటిని వర్గీకరించి, అవసరం ఉన్న ఆపన్నులకు వాటిని పిల్లల ద్వారా అందజేయండి. తద్వారా పిల్లలు తాము చేసిన మంచి పనిని గుర్తిస్తారు. వారిలో ఒకరకమైన సంతృప్తి మిగులుతుంది.



### పిల్లలు లైన్లో నడవడానికి

అసెంబ్లీ నుంచి క్లాసుకు, అదేవిధంగా క్లాసు నుంచి అసెంబ్లీకి వెళ్లేటప్పుడు ఎక్కువసార్లు పిల్లలు లైను తప్పడానికి ప్రయత్నిస్తుంటారు. ఇటువంటి విద్యార్థులకు, 'మీ ఎదుట ఉన్న వ్యక్తి తల వెనక భాగాన్ని మీ రెండు కళ్ళూ చూడాలి' అని చెప్పండి. ఎంత పెద్దవరస అయినా ఇట్టే ఒకే క్రమంలోకి వస్తుంది.



### హోం వర్క్ ఛార్టు

మీరు సాధారణంగా హోంవర్క్ ఇవ్వడం లేదా ఏదైనా పాఠం చదువుకురమ్మని విద్యార్థులను పురమాయిస్తుంటారు. అయితే కొంతమంది పిల్లలు ఇటువంటివి పూర్తి చేసుకోకుండానే తరగతి గదికి వస్తుంటారు. ఇటువంటి విద్యార్థులను లేపి అడగడం వల్ల వారు సమాధానాలు చెప్పకపోవచ్చు, అదేవిధంగా నలుగురి ముందు లేసి అడిగినట్లయితే అవమానంగానూ భావిస్తారు. కొన్ని సమయాల్లో విద్యార్థుల ప్రవర్తన వల్ల మీ మూడ్ చెడిపోవచ్చు. వీటన్నింటినీ పరిహరించడం కోసం హోంవర్క్ ఛార్టును ఏర్పాటు చేయండి. తరగతి గదిలోని విద్యార్థుల పేర్లతో కూడిన ఒక ఛార్టును ఏర్పాటు చేయండి. ఏ విద్యార్థి అయితే హోంవర్క్ లేదా పాఠం చదవకుండా క్లాసుకు వస్తాడో ఆ విద్యార్థి ఈ ఛార్టులో సంతకం చేయాల్సి ఉంటుంది, అటువంటి విద్యార్థి ఆ తరగతిలో ఎలాంటి ప్రశ్నలూ వేయడం జరగదు. ఇలా నెలలో మూడుసార్లు ఉల్లంఘించిన విద్యార్థిపై తల్లిదండ్రులకు నోట్ పంపవచ్చు లేదా పనిష్మెంట్ కింద తరగతి గదిలో చేయగల ఏదైనా క్లిష్టమైన పనిని అప్పగించండి. తద్వారా విద్యార్థి తన తప్పు తెలుసుకుని హోంవర్క్ అసైన్‌మెంట్లు పూర్తిచేస్తాడు.



### కోర్కెల డెమో

మంచి మార్కులు తెచ్చుకోవాలని, కథలు పుస్తకాలు లేదా బొమ్మలు కొనుక్కోవాలని, సైకిలు తొక్కడం నేర్చుకోవాలని, జూకి వెళ్ళాలని ఇలా ప్రాథమిక పాఠశాలలో చదివే పిల్లలు రకరకాల అభిలాషలు వ్యక్తం చేస్తుంటారు. తరగతి గదిలో ఖాళీ ఉన్న సమయంలో వారి మనస్సులో ఉన్న విషయాలను తెలుసుకోండి. వాటిని ఒక అందమైన ఛార్టుపై రాయండి. తరగతి గదిలో వేలాడదీయండి. రోజుకు ఒకసారి వాటిని గుర్తుచేసుకోమని విద్యార్థులకు చెప్పండి. అదేవిధంగా వాటిని తల్లిదండ్రులపై ఒత్తిడి పెట్టకుండా ఎలా పొందవచ్చో వివరించి చెప్పండి. తద్వారా తరగతి గదిలో మెరుగైన ప్రదర్శనను కనబరచడం ద్వారా ఆ విషయాలను తల్లిదండ్రులకు చేరవేసే బాధ్యతను చేపడతానని వారికి వివరించండి. దీంతో తమ కోరికలను నెరవేర్చుకోవడం కోసం విద్యార్థులు తరగతి గదిలో చురుగ్గా పాలుపంచుకుంటారు. అయితే మీరు ఆశించిన ఫలితాలు వారి నుంచి పొందిన తరువాత ఆయా పిల్లల్ని ఆ పిల్లలు కోరుకునే వాటిని కొనిచ్చేందుకు ఒప్పించే బాధ్యత మీదే సుమా!

### ఫ్యాక్ట్ షీటు

మీ తరగతి గదిలోని విద్యార్థులకు సంబంధించి ఒక ఫ్యాక్ట్ షీటు ఏర్పాటు చేసుకోవడం ద్వారా అనేక లాభాలుంటాయి. పిల్లల తల్లిదండ్రుల పేర్లు, వారి వృత్తి, వీలైతే వారి ఫోన్ నెంబరు, వారి ఆదాయం, అదేవిధంగా పిల్లలు ఇంటి వద్ద చదువుకు వారు ఏ మేరకు సాయం చేస్తారు, బడి అయిన తరువాత పిల్లలు ఇంటి వద్ద ఎంతమేరకు కుటుంబ కార్యక్రమాలకు సాయం చేయాలి, విద్యార్థికి ఉన్న ఆరోగ్య సమస్యలు.... ఇలాంటి వివరాలన్నీ ఫ్యాక్ట్ షీటు రూపంలో సేకరించి(విద్యార్థుల ద్వారా, వారి తల్లిదండ్రుల ద్వారా) ఒక ఫైల్‌లో భద్రపరచుకోవడం వల్ల ఎంతో లాభదాయకంగా ఉంటుంది. దీనివల్ల ఎలాంటి విద్యార్థులకు తక్కువ హోంవర్క్ ఇవ్వాలి, అత్యవసర పరిస్థితుల్లో ఎవరికి కబురు చేయాలి లేదా ఆర్థిక సంబంధమైన విషయాల్లో తల్లిదండ్రులకు వెసులుబాటు ఉండేవిధంగా ఎలా వ్యవహరించాలన్నది అవగతమవుతుంది.



# ‘పై’ విలువ నిరూపిద్దాం!



జామెంట్రీలో ‘పై’ అనే పదం మనకు చాలాసార్లు వినిపిస్తూ ఉంటుంది. దీన్ని రేఖాగణిత లెక్కల్లో 22/7గా చెబుతారు. ఇది మనందరికీ తెలిసిందే. వృత్త పరిధికి, వృత్త వ్యాసానికి ఉన్న నిష్పత్తి ఎల్లప్పుడూ స్థిరంగా ఉంటుందని మనం జామెంట్రీ లెక్కల్లో తెలుసుకున్నాం.

దీన్నే ‘పై’ సూత్రం... పై = వృత్తపరిధి/వ్యాసం లేదా వృత్త పరిధి/2x వ్యాసార్థంగా మనం నేర్చుకున్నాం.

ఇది ఇలా ఉంటే సూత్రంగా వింటున్నప్పుడు కాస్త గందరగోళంగా అనిపిస్తుంది కదా..

ఒక పేపరు తీసుకుని రకరకాల(సైజుల్లో) వ్యాసార్థాలతో మనం వృత్తాలను చేసుకుని ‘పై’ విలువను తెలుసుకుందాం. దీంతో లెక్కల టెస్టులో ఉన్న ‘పై’ సూత్రం చక్కగా అర్థమైపోతుంది. అంతేగాకుండా... ఇక లెక్కల్లో మీకు ఎప్పుడు ‘పై’ విలువ ఇచ్చినా గందరగోళం ఉండదు. పాత ఫ్రెండ్‌లా అనిపిస్తుంది. ఇక మొదలెట్టేద్దాం...

ఒక తెల్లపేపరు, పెన్సిల్, కంపాస్‌తో రెడీ అయిపోండి మరి!

పేపర్ మీద మూడు సెంటీమీటర్ల వ్యాసార్థంతో ఒక వృత్తం గీయండి.(బొమ్మ 1)

పేపరు నుంచి వృత్తాన్ని కత్తిరించి వేరు చేయండి, వృత్తం మీద ఏదో ఒక చోట ‘ఎ’ అనే బిందువును గుర్తించండి. ఇప్పుడు ఒక దారం తీసుకుని వృత్తం మీద ‘ఎ’ బిందువు మీద మొదలుపెట్టి, అక్కడికే వచ్చే వరకు కొలవండి. అంటే వృత్తం పొడవు(పరిధి) ఎంతో మనకు తెలిసిపోయింది. దారం పొడవే వృత్తం పరిధి కదా(బొమ్మ 2)

ఇప్పుడు వృత్తపరిధిని వ్యాసార్థంతో భాగించాలి. వ్యాసం అంటే తెలుసుకదా? మనం తీసుకున్న వ్యాసార్థం మూడుని రెట్టింపు చేస్తే వస్తుంది. ఈ లెక్కలో వ్యాసం 32=6

మీరు దారంతో కొలిచిపెట్టుకున్న వృత్తపరిధి/వృత్త వ్యాసం (6) = ఈ లెక్కను చేస్తే వచ్చే విలువే ‘పై’ విలువ.

మనం పైన 3 సెంటీమీటర్ల వ్యాసార్థం తీసుకుని వృత్తం గీసి, ఈ లెక్క చేశాం కదా!

అలాగే నాలుగు సెంటీమీటర్లు, ఐదు సెంటీమీటర్లు, ఆరు సెంటీమీటర్లు.... ఇలా కంపాస్‌తో ఏ వ్యాసార్థం తీసుకుని వృత్తం గీసి, ఈ లెక్క చేసినా చివరికి వచ్చే సమాధానం... 22/7 = 3.14.... ఇదే.

ఇప్పుడు పైన చెప్పుకున్న సూత్రాన్ని మరోసారి గుర్తు చేసుకుందాం. ఎంత వ్యాసార్థం తీసుకుని వృత్తం గీసినా, ప్రతి ఒక్కసారీ ఆ వృత్త పరిధి(చుట్టుకొలత)కి, దాని వ్యాసానికి ఉండే నిష్పత్తి ఒకేవిధంగా ఉంటుంది.

అంటే...

(బొమ్మ 1)




(బొమ్మ 2)



# జీవన నైపుణ్యాలు

ఒక వ్యక్తి తన పరిసరాలు, సమాజం, స్నేహితులు, కుటుంబం, తన మూర్తిమత్వానికి అనుగుణంగా ప్రవర్తించడానికి, జీవించడానికి అవసరమైన నైపుణ్యాలను 'జీవన నైపుణ్యాలు' అంటారు. ఈ జీవన నైపుణ్యాలను కలిగి ఉండడం వల్ల ప్రతి వ్యక్తీ సాధికారతను కలిగి, సమాజంలో సరైన రీతిలో జీవించగలడు.

యునిసెఫ్, యునెస్కో, డబ్ల్యు.హెచ్.ఒ సంస్థల ప్రకారం- ముఖ్యమైన 10 జీవన నైపుణ్యాలు ఏవనగా...

క్లిష్టంగా ఆలోచించడటం, సృజనాత్మకంగా ఆలోచించడం, నిర్ణయాధికారత, సమస్యా పరిష్కారం, సంభాషణా నైపుణ్యాలు, పరస్పర అనుబంధాలను పెంచుకునే నైపుణ్యాలు, వ్యక్తిగత నైపుణ్యాలు, ఇతరులను గురించిన ఆలోచన, ఒత్తిడి, భావోద్వేగాలపై నియంత్రణ.



**1. క్లిష్టంగా ఆలోచించడం**

- సరైన నిర్ణయాలను తీసుకోవడానికి, స్పష్టంగా ఆలోచించడం.
- సమాచారాన్ని, అనుభవాలను విపులంగా పరిశీలించి నిర్ణయాలు తీసుకోవడం.
- సందర్భానుసారంగా ఆలోచించి, వ్యక్తుల యొక్క పరిసరాలకు అనుగుణంగా, మంచి,చెడులను దృష్టిలో పెట్టుకుని నిర్ణయాలు తీసుకోవడం.

**లాభాలు :**

- వ్యక్తి దృక్పథాన్ని, ప్రవర్తనను అంచనా వేయడానికి ఉపయోగపడుతుంది.
- బాధ్యతాయుతమైన ప్రవర్తనను పెంపొందించ డానికి దోహదపడుతుంది.



- నిర్ణయాలను తీసుకునే వ్యక్తి యొక్క వ్యక్తిగత విలువలు, ఇష్టాలను అనుసరించి వివిధ ప్రత్యామ్నాయాలను గుర్తించడం.
- తీసుకున్న నిర్ణయాలకు వివిధ ప్రత్యామ్నాయాలు, వాటి పర్యవసానాలను అంచనావేయడం.
- వ్యక్తిగత నిర్ణయాలకు లాభనష్టాలు బేరీజు వేయడం, దగ్గరున్న సమాచారాన్ని ఉపయోగించుకుని పరిస్థితులను అంచనా వేయడం.

- సృజనాత్మకంగా ఆలోచించడం అనగా... స్వంతంగా ఆలోచనలను ఉత్పన్నం చేయడం, అనుభవాలు, వస్తువులు, విధానాలను కలిపి ఆలోచించడం.
- ఈ సృజనాత్మకత మన అనుభవాల పరిధి కన్నా మించి ఆలోచించగలం, అసాధారణంగానూ, వైవిధ్యంగానూ ఆలోచించి, వివిధ సమస్యలను అధిగమించవచ్చు.
- ఒక సమస్యను ఒకే విధంగా గాక, వివిధ కోణాలలో పరిశీలించి ఆలోచించి, సమస్యను సాధించడం.



**లాభాలు :**

- మనం తీసుకునే నిర్ణయాలకు వివిధ రకాలైన విధానాలను తెలుసుకోగలం/ఒక సమస్యను ఎన్ని రకాలుగా, ఎన్ని పద్ధతులలో సాధించగలమన్న విషయాన్ని తెలుసుకోగలం.
- నిజ జీవితంలోని సంఘటనలకు సరైనరీతిలో స్పందించగలం. సులభంగా ఒదిగిపోగలం.
- రోజువారీ జీవితంలో వైవిధ్యతను, వినూత్నతను కలిగిస్తుంది.
- సమస్యలను అధిగమించడానికి, సరైన నిర్ణయాలను తీసుకోవడానికి ఉపయోగపడుతుంది.

---

- కష్టమైన పరిస్థితులను ఏ విధంగా గుర్తించి, సరైన రీతిలో సమస్యలను అధిగమించడం. వీటిలో ముఖ్యంగా...
- పరిస్థితులను అర్థంచేసుకోవడం
- సమస్యను గుర్తించడం.
- ఒక విషయం గురించి తీర్పు నివ్వడం
- సమస్య మూలకారణాలను గుర్తించడం.
- సమస్య సాధనకు సరైన మూలాన్ని గుర్తించడం.
- సమస్యను సాధించడానికి సరైన పూరణం ఇవ్వడం.



---

- ఇద్దరు వ్యక్తుల మధ్య వివిధ గుర్తులు, సంజ్ఞల ద్వారా సమాచారాన్నిచ్చి పుచ్చుకోవడం.
- మాటల ద్వారా, చేతల ద్వారా, సంజ్ఞల ద్వారా మన అభిప్రాయాలను, కోరికలను, అవసరాలను, భయాలను వ్యక్తపరచ గలగడం. ఇతరుల నుంచి సలహాలను, సహాయాన్ని కోరడం.

**లాభాలు :**

- వినడం, గ్రహించడంలోని తేడాను గుర్తించగలగడం.
- సమాచారం కచ్చితంగా ఇతరులకు చేరవేయడం.
- సంభాషణలోని అంతరాయాలను, సమాచారాన్ని వ్యక్తీకరించడం తొలగించడం.
- పరస్పర అనుబంధాలను పెంచుకునే నైపుణ్యాలను ఏర్పరచుకోవడం.
- సమాజంలో ఆమోదాన్ని పొందడానికి సంభాషణా నైపుణ్యాలు పెంపొందించుకోవడం చాలా అవసరం.



**సంభాషణా నైపుణ్యాలు అనగా...**

- మాటలు, సంజ్ఞాల ద్వారా సంభాషించడం.
- చక్కగా విని, గ్రహించి, అభిప్రాయాలను తెలియజెప్పడం.
- మాట్లాడే విధానం, పద్ధతి, ఉచ్ఛారణ, వస్త్రధారణ మొదలైన నైపుణ్యాలు.
- ప్రజల ముందు మాట్లాడే నైపుణ్యాలు/సభలలో ప్రసంగించడం.
- ఇష్టంలేని పనులను ధైర్యంగా వ్యతిరేకించగలగడం/ కచ్చితత్వం.
- మన శరీర భంగిమలు వ్యక్తపరిచే భావాలు పరిశీలించడం.

- పరస్పర అనుబంధాలు అనగా సాంఘిక అనుబంధాలు.
- ఇతరులతో మనకున్న అనుబంధాల గురించి అవగాహన / అర్థం చేసుకోవడానికి, సానుకూలంగా స్పందించడానికి ఈ నైపుణ్యాలు ఉపయోగపడతాయి.
- ఇతరులతో కలిసిమెలిసి ఒదిగిపోయి జీవించడానికి ఈ పరస్పర అనుబంధాలు ఉపయోగపడతాయి.

**లాభాలు :**

- మనం స్నేహితులతోనూ, కుటుంబ సభ్యులతోనూ సత్సంబంధాలు పెంపొందించుకోవడానికి ఈ నైపుణ్యాలు ఎంతో ఉపకరిస్తాయి.



- మనలోని బలాలు, బలహీనతలను గుర్తించడం, మన నడవడికను పరిశీలించుకోవడం. ఈ విధంగా చేయడం వల్ల మన పనులను, తీసుకునే నిర్ణయాలను సరైన రీతిలో తీసుకొనగలం.
- మన వ్యక్తిత్వాన్ని గురించి పరిశీలించుకోవడం వల్ల మన నడవడిక, బలాలు, బలహీనతలు, ఇష్టాయిష్టాల గురించి తెలుసుకొనగలం.
- మంచి సంభాషణా నైపుణ్యాలు, సత్సంబంధాలు పెంచుకోవడానికి, ఇతరుల గురించి అర్థం చేసుకోవడానికి స్వయం పరిశీలన అవసరం.







- ఇతరుల భావోద్వేగాలను గుర్తించి అర్థం చేసుకుని, వారితో మంచిగా ఉండడం.
- ప్రతి విషయాన్నీ ఇతరుల దృష్టితో చూసి అర్థం చేసుకోవడం.
- ఇతరుల పట్ల సహనం, సహాయ భావాలు కలిగి ఉండడం.
- మనకు ఎదురుగాని / అవగాహనలేని సందర్భాలలో కూడా మనం ఇతరుల వైపు నుంచి ఆలోచించి, ఊహించగలగడం.

**లాభాలు :**

- ఈ సద్భావన కలిగి ఉండడం వల్ల మనం ఇతరులను సరిగ్గా అర్థం చేసుకుని, వారి ప్రవర్తన ఎంతో వైవిధ్యంగా ఉన్నా ఆమోదించగలుగుతారు.



- మనలోని భావోద్వేగాలు దైవిక, మానసిక సంబంధమైనవి.
- మనలోని ఆలోచనలకు మెదడు స్పందించినప్పుడు విడుదల చేసే హార్మోన్లు, రసాయనాల ఫలితంగా మనలో సంతోషం, దు:ఖం, ఆసహ్యం, కోపం మొదలైన భావోస్వేగాలు కలుగుతాయి.
- భావోద్వేగాలతో సంయమనం / నియంత్రణ అనగా... ఎటువంటి సందర్భాలలోనైనమా, సమస్యలు ఎదురైనప్పుడూ వాటిని సమర్థవంతంగా ఎదుర్కొనడం, సాధించడం.
- శరీరం లోపలి లేదా బయటి ఉత్ప్రేరకాలకు శరీరంలో కలిగే మానసిక స్పందన, భావాలను భావోద్వేగాలంటారు.
- ఈ భావోద్వేగాలూ మంచి, చెడు అని రెండు రకాలుగా ఉంటాయి.
- ఈ భావోద్వేగాలను సరైనరీతిలో మనం నియంత్రించు కోగలిగితే ఉపయోగాలు చాలా ఉంటాయి. కానీ, వాటిని సరిగ్గా నియంత్రించుకోలేకపోతే అనర్ధదాయకంగా మారతాయి.

కాబట్టి, ఈ భావోద్వేగాలను గుర్తించి, సరైనరీతిలో స్పందించగలిగితే ఇతరులతో మనం సత్సంబంధాలు పెంచుకోగలం.

---



- శరీరంలో తీవ్రమైన ఆందోళన కలిగినప్పుడు, శ్రమ ఎక్కువైనప్పుడు శరీరం ఒత్తిడికి లోనవుతుంది.
- శరీరం ఒత్తిడికి లోనయినప్పుడు, శారీరక చర్యలు వేగవంతమవుతాయి. వీటి తీవ్రతను మెదడు నియంత్రించలేదు.

ఇటువంటి శారీరక స్థితి, శారీరక, మానసికమై లేక భావోద్వేగాల / సంఘటనల వల్ల కలుగుతుంది.

ఉదా: ప్రేమించేవారు, స్నేహితులు చనిపోవడం.

ఇటువంటి పరిస్థితుల్లో ఒత్తిడిని సరైన రీతిలో జయించకపోతే / అధిగమించకపోతే చాలా అనర్థాలు జరగవచ్చు.

కాబట్టి మనం ఈ ఒత్తిడిని కలిగించే అంశాలను గుర్తించి, అవి మనకు కలుగజేసే వానిని గుర్తించి సరైన రీతిలో వాటిని అధిగమించడం చాలా అవసరం.

ఒత్తిడిని అధిగమించే కొన్ని పనులను మనం చేపట్టాలి. ఉదా: మన పరిసరాలను మార్చుకోవడం, జీవన విధానంలో మార్పులు, సేదతీరడం, విశ్రాంతి మొదలగునవి.

శారీరక, మానసిక ఒత్తిడికి లోనయినప్పుడు ఈ ఒత్తిడిని అధిగమించే నైపుణ్యాలు కలిగి ఉండడం వల్ల వ్యక్తి ఎటువంటి పరిస్థితులనైనా ధైర్యంగా ఎదుర్కోనగలుగుతాడు. ప్రతికూల పరిస్థితులలోనూ మానసిక స్థైర్యం సడలకుండా ఉండగలరు.

పైన తెలిపిన ఈ 10 జీవన నైపుణ్యాలు ప్రపంచవ్యాప్తంగా అందరూ తమ విజయయాలకు, ఆనందానికి పాటించే సూత్రాలు. అందరికీ అన్ని నైపుణ్యాలపైనా పట్టు సాధించడం సాధ్యం కాకపోయినా, సాధ్యమైనంత వరకు వీటిని సాధన చేయాలి. ప్రపంచీకరణ, పోటీతత్వం ఎక్కువైన నేటి పరిస్థితులలో మనకున్న సామర్థ్యాలను, అనుభవాలను మెరుగుపరుచుకోలేకపోతే ఇమడలేం. ఈ జీవన నైపుణ్యాలు కలిగి ఉండడం వల్ల మనం మన జీవితంలోని ఒడిదుడుకులను సమర్థవంతంగా ఎదుర్కొనగలం. సమస్యల సుడిగుండంలో చిక్కుకున్నప్పుడు కూడా ప్రశాంతంగా బయట పడగలం.

# అభ్యసన ఊహాగానాలు

1.
అభ్యసనకు వయసుతో నిమిత్తం లేదు. కొందరు వేగంగా నేర్చుకుంటారు. ఒకరు ఎంతో బాగా, వేగంగా నేర్చుకోవడానికి వయసు ఎన్నటికీ ఆటంకం కాదు. నేర్చుకునే విధానంలో, ఆసక్తి చూపడంలోనే ప్రతి ఒక్కరిలో తేడా ఉంటుంది.

4.
విద్యార్థులు తమ కుటుంబాలు, సామాజిక వర్గాల్లోని ఇతరులతో తమ సంబంధాలను, అనుభవాలను విశ్లేషించే స్థాయిపై దీర్ఘకాలిక అభ్యసన ప్రభావం ఆధారపడి ఉంటుంది.



2.
నేర్చుకునే విధానంలో అంటే ఏదైనా కొత్త అంశాన్ని నేర్చుకోవడంలో అనుభవపూర్వకమైన మార్పులు ఉండవచ్చు. వీరు కొంత ఒత్తిడికి లోవుతున్నామనో, అయోమయంగా ఉందనో భావించవచ్చు. కొందరిలో రేకెత్తే ఆందోళన అభ్యసనకు స్ఫూర్తినీయవచ్చు. అతిగా ఆందోళనచెందడం వల్ల ఆయాసం, ఏకాగ్రత కోల్పోవడం, వ్యతిరేకత మొదలైన అడ్డంకులు తలెత్తవచ్చు. పరిసరాలు అనుకూలించే విధంగా ఉంటే అభ్యసనకు ఎలాంటి ఆటంకం ఉండదు. వాతావరణం అభ్యసనకు వీలుగా ఉండాలి, పలురకాల భావనలు, ఆలోచనలు, విలువలు ఆకళింపుచేసుకునేందుకు వీలుగా ఉండాలి.

## ఈ పుస్తకాలు చదవండి

మీకు బోధనాపరంగా, క్లాస్ నిర్వహణ పరంగా పనికి వచ్చే సూచనలు, సలహాలతో కూడిన పుస్తకాలు లైబ్రరీల్లో వెతికి చదవండి. మీకు రెండు పుస్తకాలు పరిచయం చేస్తున్నాం. వీటి గురించిన కొద్దిపాటి వివరణ మాత్రమే లభించింది. పూర్తి పుస్తకాలు వెతకండి. దొరికితే ఆసాంతం చదవండి.

### ది ట్రూత్ ఎబౌట్ టీచింగ్

ఈ పుస్తకం రచయిత కాలిన్ ఆర్మ్‌స్ట్రాంగ్. ఈమె అపార బోధనా అనుభవం కలిగిన విద్యావేత్త. కొత్త ఉపాధ్యాయులు తోటి ఉపాధ్యాయులతో, క్లాసులో విద్యార్థులతో ఎలా మెలగాలన్నది వివరించారు. లెసెన్‌ప్లాన్స్ నుంచి పెద్ద క్లాసుల్లో ఎంత ఆకర్షణీయంగా బోధించవచ్చన్నది ఆర్మ్‌స్ట్రాంగ్ చక్కగా వివరించారు. ఉపాధ్యాయులందరూ ఒక్కటే, ఒకరికి ఒకరు తోడ్పడుతూనే ఉంటారు ఇదో గొప్ప కూటమి అనే భావననమ్మిన గొప్ప విద్యావేత్త ఆయన. వృత్తిలో ఎదురయ్యే కష్టనష్టాలు, ఆనందాలు, అవార్డులు, మద్దతులు, విమర్శలను ఎదుర్కొనడం.. అనేక వృత్తిపరమైన లోయలు, శిఖరాల అనుభవాల పుట్ట ఈ పుస్తకం. దీన్ని ప్రతి ఉపాధ్యాయుడు చదవడం అవసరం కూడా. ఇంకా ఈ పుస్తకంలో ఉపాధ్యాయులకు రోజూవారి బోధనా విధానాలు, క్లాస్‌రూమ్ అనుభవాల్లో వ్యవహరించాల్సిన తీరుపై సూచనలు సలహాలు 150 దాకా ఉన్నాయి. ఈ పుస్తకానికి 2007లో బెంజిమెన్ ఫ్రాంక్లిన్ బుక్ అవార్డ్ లభించింది.

3.
విద్యాబోధన సమయంలో కొందరు ఉపాధ్యాయులు విద్యార్థుల జీవితానుభవాలను కూడా వ్యక్తంచేసేందుకు వీలుకల్పిస్తారు. అలాగే, ఇతరుల పరిశీలన, వ్యక్తిగత ఆలోచనలు భావాలను కూడా ఆహ్వానిస్తారు. పలు రకాల ప్రవర్తనా విధానాలు, నమ్మకాలు, విద్యార్థుల అభ్యసనా లక్ష్యాల సాధనలో ఉపయోగపడే విధంగా తోడ్పడతాయి.

6.
నేర్చుకునే విద్యార్థి ఉత్సాహంతో ఉంటే అభ్యసన మరింత చురుగ్గా సాగుతుంది. అనేక బోధనా విధానాలు ఎంపికచేయడంలో, అయితే ఈ ఎంపికచేసేటపుడు అభ్యసనకు ప్రాధాన్యతనిచ్చేది ఎంపికచేయడం మంచిది. బోధనలో అనేక విధానాలు ఉపయోగించడంవల్ల విద్యార్థి ఎంతో ఆసక్తి చూపేందుకు అవకాశం ఉంటుంది.

5.
విద్యారంగ కార్యక్రమాలు వ్యక్తిగతంగా ఒకరి ప్రవర్తనలో కొత్త మార్గానికి వీలుకల్పిస్తుంది. కొత్త ప్రవర్తనను అందిపుచ్చుకోవడమనేది అనేక అంశాలపై ఆధారపడింది. కొన్ని సందర్భాల్లో గతంలో నేర్చుకున్న విజ్ఞానాన్ని, ప్రవర్తనను అమలుపరచవలసి వస్తుంది.

## 10

1. ఒక పనిని కొనసాగించడం ద్వారా నేర్చుకుంటాం.
2. మనం చేయాల్సిందే నేర్చుకుంటాం.
3. అభ్యసనకు సంసిద్ధంగా లేకుంటే ఆ అభ్యసన ప్రమాదకరం.
4. స్ఫూర్తిలేని అభ్యసన దుర్లభం.
5. ప్రతిస్పందనే పటిష్టమైన అభ్యసనకు శక్తినిస్తుంది.
6. అర్థవంతమైన అంశాలు మంచి అభ్యసనకు వీలు కల్పిస్తాయి.
7. అత్యుత్తమస్థాయిలో జ్ఞానబదలాయింపునకు ఉపయోగకరమైన ప్రతిస్పందన అవసరం.
8. పరిస్థితులను అవగతం చేసుకునే స్థాయిలను అనుసరించి ప్రతిస్పందనలో వ్యత్యాసాలు ఉంటాయి.
9. ఒక విద్యార్థి స్పందనలో వ్యత్యాసం అనేది అతని అభ్యసనా వాతావరణాన్ని అనుసరించి ఉంటుంది.
10. శారీరక పరిస్థితులు, మద్దతు, ప్రస్తుత కార్యాచరణ దక్షత అనుసరించి ఒకరు ఒక పనినే చేయడమనేది జరుగుతుంది.

## క్లాస్‌రూమ్ దట్ స్పార్క్స్

బోధనను అమితంగా ప్రేమించే ఉపాధ్యాయులకు ఇదో గైడ్‌గా చెప్పుకోవచ్చు. ఎమ్మా ఎస్.మెక్‌డొనాల్డ్, డైయాన్ ఎం.హెర్స్‌మెన్ అనే ఇద్దరు వెటరన్ ఉపాధ్యాయులు తమ అనుభవసారాన్ని అందించారిందులో. బోధనారంగంలో ఉన్నవారు, కొత్తగా ఈ రంగరంలోకి వచ్చినవారు క్లాస్‌రూమ్‌ను ఎలా నియంత్రించాలి, విద్యార్థుల్లో అభ్యసనపట్ల ఆసక్తిని ఎలా పెంపొందించాలి, అభ్యసనకేంద్రంగా క్లాస్‌రూమ్ నిర్వహణ... ఇలా అనేకానేక ఆసక్తికర విభాగాల్లో వారు ఎన్నో ఉపయోగపడే సూచనలు సలహాలిచ్చారు. క్లాస్‌లో విద్యార్థులు, ఉపాధ్యాయులు అబ్యసన, బోధనాపరమైన కొత్త ఆలోచనలు ఎలా చేయాలి, సత్ఫలితాలు ఎలా సాధించవచ్చు, వాస్తవజీవనానికి ఉపయోగపడే క్లాస్‌రూమ్ పరిసరాలను ఎలా అభివృద్ధిచేయవచ్చు... అనేవి విశేషంగా పేర్కొన్నారు. ఈ పుస్తకం 2006లో టీచర్స్ ఛాయిస్ అవార్డు అందుకుంది.

# [illegible]

అభ్యసనే కాదు... బోధన కూడా నిత్య అభ్యసన ప్రక్రియ. ఉపాధ్యాయుడు ఎంత మెరుగ్గా బోధనా ప్రక్రియలో ఇమిడి ఉండే అంశాలపై దృష్టిసారిస్తాడో... బోధనా ఫలితాలు అంతగొప్పగా ఉంటాయి. కరిక్యులంలో భాగంగానే కాకుండా, సామాజికపరంగానూ, వ్యక్తిగతంగానూ నిత్యం ఎంతో సరికొత్త లక్షణాలను పుణికిపుచ్చు కోవడం ద్వారా ఉపాధ్యాయుడు తన రంగంలో మిగిలిన వారికంటే అగ్రగామిగా నిలుస్తాడు. తోటివారికి ఆదర్శంగా నిలవడంతోపాటు సమాజంలో గౌరవ మర్యాదలను పొందుతాడు.





**అమోదించాల్సిన వాటిలో చేర్చండి**

బోధనాపరంగా మీకు ఎంతో ప్రతిభ, నైపుణ్యం ఉండవచ్చు. వాటిని మరింత అభివృద్ధి చేసుకోవడం ద్వారా మరింత నైపుణ్యం సాధించేందుకు అవకాశం ఏర్పడుతుంది. విభిన్న బోధనా నైపుణ్యాలు ఎంత ఎక్కువగా ఉంటే... అంత గొప్పగా మీరు ఉపాధ్యాయ వృత్తిలో రాణిస్తారు. అందుకే విరామం దొరికినపుడల్లా బోధనా నైపుణ్యాలను మెరుగుపర్చుకోవాలి. అయితే తాము బోధించే తరగతి, విద్యార్థుల అభ్యసనా స్థాయి గురించి పూర్తి అవగాహన కూడా అవసరం. తద్వారా ఉపాధ్యాయుడు అత్యున్నత బోధనా లక్షణాలు కలిగిన ఉపాధ్యాయునిగా అందరి మన్ననలూ అందుకోగలుగుతాడు.

**బోధనా నైపుణ్యం పెంచుకోండి - రాబడి పెంచుకోండి**

ఉపాధ్యాయులు తమ విద్యార్హత అనుసరించి జీతభత్యాలు అందుకుంటాడు. పీజీ అలాగే రీసెర్చ్ చేయడం ద్వారా కూడా వృత్తిపరంగా గౌరవమర్యాదలతో పాటు, ఆదాయం పెరిగే అవకాశాలుంటాయి. అందుకే విద్యార్హతలను పెంచుకునేందుకు ఉన్న అవకాశాలను వెతకండి.

**సాంకేతిక నైపుణ్యాన్ని అభివృద్ధి చేసుకోండి**

బోధనాభ్యసనల్లో ఎన్నో సాంకేతికపరమైన మార్పులు చోటుచేసుకుంటున్నాయి. మారుతున్న కాలానికి అనుగుణంగా సాంకేతికతను అందిపుచ్చు కునేందుకు ఉపాధ్యాయులు సాంకేతిక నైపుణ్యాన్ని పరిచయం చేసుకుని సాధన చేయాలి. విద్యారంగంలో పలు ఆసక్తికర విషయాలతో పాటు, సబ్జెక్టుకు సంబంధించిన అదనపు సమాచారాన్ని, విశేషాలను, పరిశోధనల వివరాలను తెలుసుకోవడానికి కంప్యూటర్ పరిజ్ఞానం సంపాదించుకోవడం ద్వారా వృత్తిలో ముందంజ వేసే అవకాశం ఉంటుంది.

**పుస్తకాలు చదవండి**

చాలామంది విద్యావేత్తలు, విద్యాతత్వవేత్తల పుస్తకాలు పెద్ద పెద్ద లైబ్రరీలలో లభిస్తాయి. వీటి అధ్యయనం ద్వారా బోధనాపరమైన లోపాలను అధిగమించే అవకాశం కూడా ఉంటుంది. అదనపు సమాచారం పొందే వీలుంటుంది. ఈ దృష్టితో పుస్తక పఠనం చేయడం ద్వారా సబ్జెక్టుపరంగానూ, బోధనాపరంగానూ మరిన్ని విజయాలను సొంతం చేసుకోగలుగుతారు. క్లాసులో విద్యార్థుల మన్ననలూ అందుకుంటారు.





**క్రమశిక్షణ మెరుగుపర్చుకోండి**

స్వీయ, విద్యార్థుల్లో క్రమశిక్షణ సంబంధ లోపాలు, సమస్యలను గుర్తించి, వాటి పరిష్కార మార్గాలను కనుగొనేందుకు నిరంతర కృషి చేయండి. తరగతి గదిలో విద్యార్థుల క్రమశిక్షణా చర్యల అమలులో వైఫల్యాలు అనుభవంలోకి వచ్చి ఉంటే వాటిని అధిగమించేందుకు ఆలోచించి మంచి కార్యాచరణ పథకాన్ని రూపొందించుకొని ఆ వ్యూహాన్ని అమలుచేసి లోపాలను అధిగమించవచ్చు. అన్నింటికంటే ముఖ్యంగా సీనియర్, తోటి ఉపాధ్యాయులను కలిసి వారి నుంచి సలహాలు, సూచనలు పొందడంతోపాటు, ఇతర పాఠశాలల్లో పనిచేస్తున్న ఉపాధ్యాయుల్లో సీనియర్లను కలిసి బోధనాపర వ్యత్యాసాలను గ్రహించవచ్చు. మెరుగైన సూచనలు వారినుంచి పొందవచ్చు.



**లెసన్ ప్లానింగ్ మెరుగుపర్చుకోండి**

పాఠం ఎంతో బాగా, విద్యార్థులకు ఆకట్టుకునేట్టుగా బోధించడానికి లెసన్‌ప్లాన్ ఎంతో అవసరం. మీ లెసన్‌ప్లాన్ రూపకల్పనే మీ బోధనా నైపుణ్యాన్ని వివరిస్తుంది. నాణ్యమైన, సరికొత్త లెసన్ ప్లాన్‌లు రూపొందించుకునే ప్రయత్నాలు చేయండి.

**చొరవ చూపండి**

బోధనాపరమైన నైపుణ్యాన్ని అభివృద్ధి చేసుకోవడం ద్వారా అధికారులు, యాజమాన్య దృష్టిని ఆకట్టుకోగలుతారు. విద్యార్థులు కూడా మీలో కొత్త ఉపాధ్యాయుణ్ని, బోధనా విధానంలో పటిమను గ్రహించి ఆకర్షితులవుతారు. మీకు వారి అభ్యసనాపరమైన లోపాలు గ్రహించేందుకు అవకాశం లభిస్తుంది.



**నిత్య అభివృద్ధి**

ఉపాధ్యాయుడు తరగతి గదిలో తన నైపుణ్యాన్ని నిత్యం మెరుగుపర్చుకుంటూనే ఉండాలి. కేవలం డబ్బు సంపాదనకే ప్రాధాన్యతనిచ్చే ఉపాధ్యాయులు అభివృద్ధి సాధించలేరు, విజేతలు కాలేరు. కొందరు ఉపాధ్యాయులు తరగతి గదిలో చెప్పుకోదగ్గ స్థాయిలో బోధనను చేపట్టడంలో ఆసక్తిని, ఆనందాన్ని అనుభవించలేక పోతుండడం దురదృష్టకరం. వారి ఉద్యోగ వృత్తి అంశాల్లో కాకుండా ఇతర అంశాల పట్ల ఆసక్తిని ప్రదర్శిస్తూ అసలు సంగతిని నిర్లక్ష్యం చేస్తారు. అయితే కొందరు ఉపాధ్యాయులు మాత్రం విద్య అంటే పరిశ్రమ కాదన్నది గ్రహించగలుగుతారు. ఉపాధ్యాయునిగా తన బాధ్యతలు గ్రహించి విద్యార్థులకు మరింత ఆసక్తిగానూ, గొప్పగానూ పాఠాలు చెప్పడానికి కొత్త కొత్త మార్గాలు అన్వేషిస్తారు. మరి ఈ గొప్ప ఆలోచనను ఉపాధ్యాయులందరూ తమకు తాముగా ఆలోచించి అమలుచేస్తే విద్యాలోకం హర్షిస్తుంది. ఉపాధ్యాయులకు, ఉత్తమ బోధకులుగా తమను తాము తీర్చిదిద్దుకునేందుకు తగిన ఆలోచనలు చేయడానికి, మార్గాలు అన్వేషించి ప్రయత్నాలు చేయడానికి, తమ గురించి ఆలోచించడానికి ఇంతకంటే మంచి అవకాశం, సమయం మళ్ళీ అంత త్వరగా లభించదు. ఉపాధ్యాయులూ... ఆలోచించండి.



# కోపంగా ఉన్న తల్లిదండ్రులతో ఎలా వ్యవహరించాలి?

తమ పిల్లల చదువులకు సంబంధించి, తోటి విద్యార్థులు వేధిస్తున్నారని, తమ పిల్లల చదువుసంధ్యల గురించి స్కూలు సరిగ్గా పట్టించుకోవడం లేదంటూ కొంతమంది తల్లిదండ్రులు కోపంతో ఊగిపోతూ, స్కూలుకు వచ్చి స్కూలు యజమాన్యం, ఉపాధ్యాయులతో గొడవలకు దిగుతుంటారు. కొన్ని సమయాల్లో ఈ వ్యవహారం పోలీసు కేసుల వరకు వెళు_ంది. ఇటీవల కాలంలో ఉపాధ్యాయులతో భౌతిక దాడులకు దిగడం పరిపాటి అయింది. ఇటు ఉపాధ్యాయుడు, అటు తల్లిదండ్రులు కాస్తంత విజ్ఞతతో వ్యవహరిస్తే, ఇటువంటి సమస్యలు పెద్దవిగా కాకుండా చూడవచ్చు. కోపంగా ఉన్న తల్లిదండ్రులతో వ్యవహరించేటప్పుడు స్కూలుముఖంగా తీసుకోవాల్సిన జాగ్రత్తలను చూద్దాం.

స్కూలు మీద, స్కూలు యజమాన్యం మీద, స్కూలులోని ఉపాధ్యాయుల మీద కోపంగా ఉండే తల్లిదండ్రులు నిజంగా స్కూలుకు జరగరాని నష్టాన్ని కలిగిస్తారు. ఆ స్కూలు గురించి, ఉపాధ్యాయుల గురించి చెడుగా నలుగురితో చెప్పడం ద్వారా స్కూలు పేరుప్రఖ్యాతలను దెబ్బతీస్తారు. ఇక స్కూల్లోని విద్యార్థుల ముందు ఉపాధ్యాయుడు, హెడ్మాస్టర్‌తో గొడవకు దిగడం, భౌతిక దాడులకు పాల్పడం, దూషించడం వల్ల వీరు విద్యార్థుల ముందు చులకనవుతారు. అదేవిధంగా ఆత్మస్థైర్యం కూడా దెబ్బతింటుంది. తత్ఫలితంగా తరువాత రోజుల్లో ఇటువంటి పరిస్థితులను ఎదుర్కొనాల్సి వచ్చినప్పుడు సందిగ్ధ ధోరణి అవలంబిస్తారు. ఫలితంగా ఇలాంటి సమస్యలు మరింత ముదురుతాయి.

సాధారణంగా తల్లిదండ్రులు స్కూలుకు సంబంధించి దిగువ విషయాల్లో ఆగ్రహం వ్యక్తం చేస్తారు.

1. తమ పిల్లలకు మంచి మార్కులు రావడం లేదని
2. కొంతమంది విద్యార్థులకు ప్రాధాన్యత ఇచ్చి, తమ పిల్లలకు ప్రాధాన్యత ఇవ్వడం లేదని
3. అతిగా హోంవర్క్ ఇస్తున్నారని
4. తమ పిల్లల్ని కొడుతున్నారని
5. ఫీజులు ఎక్కువగా వసూలు చేస్తున్నప్పటికీ, సదుపాయాలు కొరత ఉన్నదని
6. సరైన క్రమశిక్షణ చర్యలు చేపట్టడంలేదని
7. కుల, మతపరమైన వివక్ష చూపించారని



పిల్లలకు తక్కువ మార్కులు రావడం, కొట్టడం వల్ల భౌతిక గాయాలు ఏర్పడడం వంటి సందర్భాలు తల్లిదండ్రులు స్కూలుపై ఆగ్రహం చెందడానికి ప్రత్యక్ష ఉదాహరణలు లభిస్తాయి. మిగిలిన చాలా సందర్భాల్లో స్కూలుపైనా, స్కూల్లోని టీచర్లపైనా, స్కూలులో నిక్కచ్చిగా అమలయ్యే విధానాలపైనా విముఖత పెంచుకునే విద్యార్థులు, ఇంటి వద్ద స్కూలుపై ఉన్నవీ లేనివీ చెబుతారు. కొన్ని సమయాల్లో మార్కులు తక్కువగా వచ్చినప్పుడు తల్లిదండ్రులు దండిస్తారనే భయంతోనూ స్కూలుపై నెపం మోపుతారు. ఇలాంటి సమయాల్లో ఎంతో సమయస్ఫూర్తితో వ్యవహరించాలి. సమస్య తలెత్తడానికి ముందు, అటువంటి సమస్యలు తలెత్తుతాయని గుర్తెరిగి ప్రవర్తించాల్సి ఉంటుంది.



మీరు పాఠాలు బోధించే తరగతి గదిలో సమస్యాత్మకంగా ఉన్న విద్యార్థుల, చదువుపరంగా వెనకబడిన విద్యార్థుల పేర్ల జాబితా తయారు చేసుకోండి. వీరి కోసం ప్రత్యేకంగా ఒక రికార్డు నిర్వహించండి. అటువంటి విద్యార్థుల పట్ల మీరు తీసుకున్న చర్యలు, దానికి వారి ప్రతిస్పందన, తరగతి గదిలోను, స్కూలు ఆవరణలోని అటువంటి విద్యార్థులు చేసిన తప్పులు, వాటిని సరిచేసేందుక మీరు ఇచ్చిన సలహాలు, సూచనలు అందులో పొందుపరచండి. మీరు తీసుకుంటున్న చర్యల గురించి స్కూలు యజమాన్యానికి కూడా తెలియజేయండి. చాలా సందర్భాల్లో విద్యార్థులు అసలు విషయాన్ని తెలియజెప్పకపోవచ్చు. ఇలాంటి రికార్డుల ద్వారా విద్యార్థుల తల్లిదండ్రులు లేవనెత్తే సమస్యలకు మీకు చక్కగా సమాధానం ఇవ్వగలుగుతారు. ఆధారాలతో సహా వివరాలను తల్లిదండ్రుల ముందుంచడం ద్వారా వారు శాంతించే అవకాశం ఉంటుంది.



సాధారణంగా ఆగ్రహంతో స్కూలుపై దండెత్తే తల్లిదండ్రులతో మీరు కూడా అదే స్వరంతో మాట్లాడడం వల్ల సమస్య మరింత పెరుగుతుంది తప్ప ఏ మాత్రమూ తగ్గుముఖం పట్టదు. కనుక ఇటువంటి వ్యక్తులను ఎదుర్కోవాల్సి వచ్చినపుడు ముఖంపై చిరునవ్వును చెరగనివ్వకండి, ఆత్మవిశ్వాసంతోనూ, ఆత్మస్థైర్యంతోనూ ఉండండి. ఇవన్నీ కూడా స్కూలుపరంగా మీరు ఎలాంటి తప్పులూ చేయలేదన్న సంకేతాలను బలంగా తల్లిదండ్రులకు చేరవేస్తుంది.



తల్లిదండ్రుల ఆరోపణలను ఆసాంతం వినండి. పూర్తిగా వినకుండానే మిమ్మల్ని మీరు రక్షించుకునేందుకు లేదా అటువంటి తప్పు జరగలేదన్న విషయాన్ని ప్రస్తావించవచ్చు. ఇది వారిలో ఆగ్రహాన్ని మరింత పెంచుతుంది. వారు చెప్పింది పూర్తిగా వినండి. వారి ఆరోపణలను అవగతం చేసుకోండి, ఆ తరువాతే వారి ఆరోపణలకు స్పందించండి.



విద్యార్థి స్కూలుకు కలిగిస్తున్న ఇబ్బంది లేదా ఆ విద్యార్థికి స్కూలు వల్ల కలుగుతున్న ఇబ్బందిని, విద్యార్థి సమస్యను, ప్రవర్తనను ఎంతో సున్నితంగా చెప్పండి. ఆ విద్యార్థి తప్పు చేశాడన్న భావన స్ఫురించే విధంగా ఎలాంటి వ్యాఖ్యానాలూ చేయవద్దు. ఇది తల్లిదండ్రుల్లో ఆగ్రహాన్ని కలిగిస్తుంది. అదే సమయంలో మీరు ద్వేషపూరితంగా మాట్లాడుతున్నారని భావించి, మీరు చెప్పే సత్యాలను, వాస్తవాలను కూడా అంగీకరించకపోవచ్చు.





స్కూలులోని ఉపాధ్యాయులు, తోటి విద్యార్థులు లేదా యాజమాన్యం ద్వారా ఎలాంటి తప్పు జరిగినా నిర్భయంగా అంగీకరించండి. అయితే స్కూలులో విద్యా, విద్యేతర అంశాలతోపాటు, స్కూలు అనుసరించే నైతిక ప్రవర్తనా నియమావళిని తల్లిదండ్రులకు స్పష్టం చేయండి. మీ విలువలు ఎంత బలమైనవన్న విషయాన్ని తెలియజేయండి. అలాంటి విలువల్ని పాదుగొల్పడంలో జరిగిన లోపాలను ఆత్మవిమర్శ చేసుకుని, ముందుకు సాగుతామని, దానికి వారి సహకారం కూడా అవసరమని చెప్పండి. అదేవిధంగా విద్యార్థి ద్వారానే సమస్య తలెత్తినట్లయితే, తల్లిదండ్రులు, తోటి ఉపాధ్యాయులు, స్కూలు యజమాన్యం, ఆ విద్యార్థిని తోవలో పెట్టేందుకు ఒక కార్యాచరణ ప్రణాళికను రూపొందించాలి.

ఇక చివరగా... స్కూలు తన పనితీరును తాను మూల్యాంకనం చేసుకునేవిధంగా విధాన రూపకల్పన చేసుకుంటే బాగుంటుంది. ప్రశ్నావళులు, ముఖాముఖి భేటీల ద్వారా విద్యార్థులు, తల్లిదండ్రులతో స్కూలుపై ఫీడ్‌బ్యాక్ తీసుకోవడం ద్వారా స్కూలు ఏ అంశాల్లో తనను తాను మెరుగుపరుచుకోవాలన్న విషయం అవగతమవుతుంది. తద్వారా ఇటువంటి సమస్యలు తరచుగా తలెత్తే అవకాశం తక్కువగా ఉంటుంది.

# పేరెంట్స్...
# ప్లీజ్... మారరూ..!!




**మా ఆఫీసులోని రామారావుగారి అబ్బాయి ఐఐటీలో సీటు సంపాదించాడు.. రేపోమాపో.. అమెరికా కూడా వెళ్లిపోతాడు... పొద్దస్తమాసం డ్రాయింగ్‌లు వేస్తూ కూర్చుంటే ఐఐటీలో సీటు ఎట్లా వస్తుంది...ఇక లాభం లేదు. ఈ పిల్లల్ని దారిలో పెట్టాలంటే.. లాంగ్‌టర్మ్ కోచింగ్‌లో చేర్పించాల్సిందే. అంటూ ఆఫీసు నుంచి ఇంటికి వచ్చిన ప్రమీల పిల్లలపై విరుచుకుపడింది.**

మార్కులు, ర్యాంకుల నేటి యుగంలో చాలామంది తల్లిదండ్రులు పిల్లల ఇష్టాఇష్టాలు, వారి అభిరుచులు, వారి తెలివితేటలు ఇవేవీ పట్టించుకోకుండా, తన ఇంటి పక్కవారో, లేదా బంధువుల పిల్లలో, ఆఫీసులోకి సహోద్యోగుల పిల్లల్లో ప్రముఖ విద్యాసంస్థల్లో సీట్లు సంపాదించారని, తమ పిల్లలు కూడా అదే పంథాలో వెళ్లాలని భావించి పిల్లల మనోభిష్టానికి వ్యతిరేకంగా చిన్నవయస్సులోనే వారి కెరీర్‌ను ప్లాన్ చేసేస్తుంటారు. వారు ప్లాన్ చేసిన కెరీర్‌ను అమలు చేయడం కోసం అటు పిల్లలపైన ఇటు స్కూలుపైనా ఒత్తిడి పెంచేస్తుంటారు. అందుకే ఇప్పుడు విద్యార్థుల కంటే తల్లిదండ్రులకే విద్యారంగంపై అవగాహన పెంపొందించాల్సిన అవగాహన ఎంతైనా ఉంది.



## చదవంటే ఐఐటి, ఎమ్‌సెట్ మాత్రమే కాదు.

తన పిల్లలకు ఒక భద్రమైన, సుఖవంతమైన భావిజీవితాన్ని అందించాలని ప్రతి తల్లిదండ్రులు కోరుకుంటారు. ఇందులో ఎటువంటి సందేహం లేదు. కార్పొరేట్ స్కూళ్ల కల్చర్ పెరిగిపోయిన తరువాత ఇప్పుడు తమ పిల్లల్ని ఐఐటి లేదా ఇంజినీరింగ్‌లోనే చేర్పాలనుకునే తల్లిదండ్రుల సంఖ్య గణనీయంగా పెరిగింది. అయితే పిల్లల ఇష్టాఇష్టాలకు దూరంగా చిన్న వయస్సులోనే తామే వారి కెరీర్‌పథాన్ని నిర్ధారించి ఆ మార్గంలో సాగాలని ఒత్తిడి చేస్తూ, ఎప్పుడో సుఖమయ జీవితం లభిస్తుందనే భావనతో ఇప్పుడు వారిని కష్టాలకు గురిచేస్తుంటారు.




మీ బిడ్డ ఆలోచనలకు కాస్తంత విలువిచ్చి, కాసేపు ఆలోచిస్తే మీ బిడ్డ భావిజీవితానికి ఒత్తిడి లేని విద్యతో ఒక్కటి పునాది వేయవచ్చు. గ్లోబలైజేషన్ కారణంగా శరవేగంగా మారుతున్న నేటి సమాజంలో రోజురోజుకు అనేక రకాల కొత్త వృత్తులు, కొత్తరంగాలు ఉద్భవిస్తున్నాయి. ఇలాంటి కొత్తరంగాలు, రాబోయే రోజుల్లో మరింత వేళ్లు కొని, మరిన్ని ఉపాధి అవకాశాలు అందించే అవకాశం ఉంది. అందుకే మీ ఆలోచనల్ని మీ బిడ్డలపై రుద్దేందుకు ప్రయత్నించవద్దు. మీ బిడ్డ ఆకాంక్షలకు తెలుసుకోండి. ఆ ఆకాంక్షలు నెరవేరేందుకు ఉండే మార్గాల్ని స్పష్టం చేయండి. వారు ఎంచుకున్న రంగంలో ఉన్నతస్థానానికి చేరుకునేందుకు ఆసరాగా నిలబడండి.

### జీవితమంతా చదువే కాదు

పోటీప్రపంచంలో ముందుండాలంటే చదువు, తద్వారా ర్యాంకులు సాధించడం తప్ప మరొకటి లేదని చాలా మంది తల్లిదండ్రులు విశ్వసిస్తుంటారు. అందుకే పరీక్షలు వస్తే చాలు చాలామంది ఇంట్లో టీవీలు మోగవు. ఆలారంలు ఉదయం 4 గంటలకే మోగుతుంటాయి. ఇక సినిమాలు, షికార్లు, స్నేహితులతో ముచ్చట్లు, బంధుమిత్రులను ఆహ్వానించడం, వారి ఇళ్లకు వెళ్లడం బంద్ అవుతాయి.

అభ్యసన ఒక సృజనాత్మక ప్రక్రియ. ఒక యంత్రంలానో, మరో పనిముట్టులానే నిరంతరం జరిగే ప్రక్రియ కాదు. మెదడునియతకాలానుసారంగానే మాత్రమే చైతన్యవంతంగా పనిచేస్తుంది. అదీ విశ్రాంతిని కోరుకుంటుంది. తమ పిల్లలు యంత్రాలు కాదని తెలిసినప్పటికీ, తల్లిదండ్రులు ఈ పోటీ ప్రపంచంలో ముందుకు సాగాలంటే ఆ మాత్రం ఒత్తిడి ఉండాల్సిందే అంటూ వారిని మరింత ఒత్తిడికి గురిచేస్తుంటారు. అన్నింటికీ మించి అవన్నీ పిల్లలకు దూరం చేయడం వల్ల కచ్చితంగా మీ పిల్లలకు ర్యాంకు వస్తుందని ఎవరైనా ప్రశ్నిస్తే ఈ తల్లిదండ్రుల వద్ద సమాధానం ఉండదు. పిల్లలు చదువుకునే సమయాన్ని చక్కగా ప్లాన్ చేయడం ద్వారా పైన పేర్కొన్న వాటిన్నింటినీ పిల్లలు దూరం చేయకుండానే అద్భుతాలు సృష్టించవచ్చు.

### జీవితం అంటే చదువే కాదు

మా అబ్బాయికి బడి, ఇల్లు తప్ప మరొకటి తెలియదంటే నమ్మండి అంటూ కొంతమంది తల్లిదండ్రులు తమ పిల్లల గురించి గొప్పగా చెప్పుకుంటారు. అయితే ఈ ఒక్క వాక్యం వారు తల్లిదండ్రులుగా ఎంత విఫలమయ్యారనే విషయాన్ని తెలియజెబుతుందనే విషయాన్ని గ్రహించరు. బిడ్డ పుట్టినది మొదలు తన చుట్టూ ఉండే పరిసరాలతోని వివిధ కారకాలతోసహజీవనం చేయడానికి యత్నిస్తాడు. నలుగురితో మాట్లాడటం, ఆత్మవిశ్వాసంతో ఉండటం, క్లిష్టపరిస్థితులను సమర్ధవంతంగా ఎదుర్కోవడం, తన అవసరాలకు ఇతరులపై ఆధారపడకపోవడం వంటి భావిజీవితానికి అవసరమైన సామాజిక నైపుణ్యాలను అందిపుచ్చుకోవడంలో ఇలాంటి పిల్లలు విఫలం అవుతారన్న విషయాన్ని గ్రహించలేకపోతారు. చదువులపరంగా, ర్యాంకులపరంగా ఎంతో ముందువరసలో ఉండే ఇటువంటి పిల్లలు కెరీర్‌పరంగా ఎన్నోఆటుపోట్లను ఎదుర్కొనాల్సి వస్తుందనే విషయాన్ని తల్లిదండ్రులు గ్రహించలేకపోతారు. బడి, కాలేజీ, చదువులతోపాటు, సమాజం జీవిగా సమాజంలో బ్రతికేందుకు అవసరమైన నైపుణ్యాలను విద్యకు సమాంతరంగా నేర్చుకున్నప్పుడే భావిజీవితం సుఖమయం అవుతుందన్న విషయాన్ని తల్లిదండ్రులు తప్పక గుర్తించాల్సిన అవసరం ఉంది.

కె. ప్రభావతి, రిటైర్డ్ టీచర్, అనకాపల్లి




**సి.వి.సర్వేశ్వర శర్మ**
ప్రెసిడెంట్,
కోనసీమ సైన్స్ పరిషత్,
అమలాపురం
98668 43982


# శరీరంలోని ఎముకల ఫొటోలు తీశాడతడు...

వైజ్ఞానిక, వైద్య, సాంకేతిక రంగాల్లో నవ చైతన్యానికి 1895, డిసెంబర్‌లో ఒక సాయంకాలం సుప్రభాతం పాడింది. ఉర్జుబర్గ్ విజ్ఞాన సంఘం ఎదుట, 50 సంవత్సరాల జర్మన్ ప్రొఫెసర్ ప్రపంచ చరిత్రలో తొలిసారిగా శరీరంలోని ఎముకలను మాత్రమే ఫొటో తీశాడు. శరీరంలోని ఎముకలు విరిగిన ప్రదేశం గుర్తించడానికి మనం ఇప్పుడు వినియోగించుకుంటున్న ఎక్స్‌రే ఛాయాచిత్రం తొలి ఫొటో అది. ఈ ప్రొఫెసర్ పేరు విల్‌హేలమ్ రాంట్‌జన్. ఇతడు 1945, మార్చి 27న రష్యాలో జన్మించాడు. తండ్రి వ్యవసాయదారుడు, తల్లి డచ్ దేశపు స్త్రీ. రాంట్‌జన్ విద్యాభ్యాసం కొంత హాలెండ్‌లోనూ, మరికొంత జ్యూరిచ్ విశ్వవిద్యాలయంలోనూ జరిగింది.

జ్యూరిచ్‌లో ప్రొఫెసర్ రుడాల్ఫ్ క్లాషియస్ వద్ద విద్య అభ్యసించడం వల్ల రాంట్‌జన్‌కు విద్యుత్, కాంతి, ఉష్ణం, స్థితిస్థాపకత వంటి అనేక అంశాలపై ఆసక్తి ఏర్పడింది. చివరికి 1885లో అతడు ఉర్జుబర్గ్ విశ్వవిద్యాలయంలో ఫిజిక్స్ ప్రొఫెసర్‌గా స్థిరపడ్డాడు. అప్పటికే రాంట్‌జన్ ఫిజిక్స్‌లో పరిశోధనలు చేసి డాక్టరేట్ పొందాడు. మైకెల్ ఫారడే విద్యుత్‌ను ఘన, ద్రవ, వాయు పదార్థాలగుండా పంపి ఎన్నో పరిశోధనలు చేశాడు. అతని కాలంనాటికి శూన్యాన్ని సమర్ధవంతంగా సృష్టించగల పరికరాలు లేని కారణంగా శూన్యంలోకి విద్యుత్‌ను పంపి పరిశోధనలు చేయలేకపోయాడు.

ఇంగ్లాండ్‌కు చెందిన సర్ విలియమ్ క్రూక్స్, ఫారడే వదిలిన పరిశోధనలను తిరిగి ప్రారంభించాడు. క్రూక్స్‌కు అందుబాటులో అత్యధిక శూన్యాన్ని ఏర్పరచగల పంపులు అందుబాటులో ఉన్నాయి. అంతేగాకుండా గాజు గొట్టాలను

తగిన రీతిలో తయారు చేసి ఇవ్వగల చక్కని నేర్పరి క్రూక్స్‌కు సహాయకుడిగా ఉండేవాడు.

క్రూక్స్ ఒక గాజుగొట్టాన్ని తయారుచేయించి దాని చివరల రెండు విద్యుద్వారాలను ఏర్పర్చాడు. గొట్టములోని గాలిని దాదాపు సంపూర్ణంగా తొలగించాడు. విద్యుత్ ద్వారాలను చాలా హెచ్చు వోల్టేజ్‌లో విద్యుత్ సరఫరా చేశాడు. గొట్టంలోపల విద్యుత్ ద్వారాల నడుమ ఒక కిరణం వెలిసింది. ఈ కిరణం రుణ విద్యుత్ ద్వారం నుంచి పుట్టింది. గాజుగొట్టంలో విద్యుత్ ద్వారాల నడుమ చిన్న రెక్కలు గల అతి తేలికైన ఫ్యాన్‌వంటి పరికరాన్ని ఉంచాడు. రుణ విద్యుత్ ద్వారం నుంచి పుట్టిన కిరణాలు ఈ రెక్కలపై పడగానే వాటిధాటికి రెక్కలు తిరగడం మొదలు పెట్టాయి. అంటే కిరణాల్లో ఏవో కణాలున్నాయని గ్రహించాడు.



కాంతి నిరోధక వస్తువులను, కాంతి కిరణమార్గంలో ఉంచినప్పుడు ఆ వస్తువుల ఛాయలు ఏర్పడతాయి. అయితే ఈ కొత్త కిరణం గాజుగోడపై పడి, ఆకుపచ్చ కాంతితో ప్రతిదీప్తి చెందింది. ఈ కిరణాలే 'ఎలక్ట్రానుల ప్రవాహం' అని తరువాత తెలిసింది. ఈ నాళానికి 'క్రూక్స్ నాళం' అని పేరొచ్చింది.

విశ్వవిద్యాలయంలో రాంట్‌జన్ క్రూక్స్ నాళంతో పరిశోధనలు చేస్తున్నాడు. నాళం చుట్టూ నల్లని కాగితం చుట్టాడు. ప్రయోగం చేసే



గదిని చీకటి చేశాడు. నాళంలోకి విద్యుత్ ఉత్సరంగా జరిపాడు. బేరియం, ప్లాటినం సైనేడ్ పూతపూసిన కాగితం మెరవసాగింది. అంటే దానిమీద మరోరకం కిరణం ఏర్పడుతుందని రాంట్‌జన్ గ్రహించాడు.

ఈ కిరణం గాజు, కాగితం గుండా దూసుకుపోతుంది. అయస్కాంత, విద్యుత్ క్షేత్రంలో వంగకుండా ఈ కిరణం నిదానంగా దూసుకుపోతుంది. ఈ కిరణాలను పలుచని అల్యూమినియం రేకుల మీద, తగరం రేకుల మీద, రబ్బరు మీద ప్రయోగించాడు. వీటన్నింటి గుండా ఈ కిరణం దూసుకుపోతుండడాన్ని గమనించాడు.

నల్ల కాగితం చుట్టబడిన ఫొటోఫిల్మ్‌ను ఈ కిరణం పాడుచేయ గలిగింది. ఈ కిరణాన్ని ఏమని పిలవాలో తెలియక 'ఎక్స్ కిరణం' అని నామకరణం చేశాడు రాంట్‌జన్. ఆల్జీబ్రాలో తెలియని దానిని ఎక్స్ అన్నట్లుగా దీన్ని 'ఎక్స్ కిరణం' అని అన్నాడు.

రుణ విద్యుద్వారాన్ని వదిలిన ఎలక్ట్రానులు క్రూక్స్ నాళంలోని ధన విద్యుత్ ద్వారాన్ని ఢీకొనడం వల్ల ఎక్స్ కిరణాలు ఉత్పత్తి అయ్యాయి. ఇప్పుడు ఎక్స్ కిరణాలను ఉత్పత్తి చేసే యంత్రాల్లో ధన విద్యుత్ ద్వారం బదులు, టార్గెట్ అనే లోహపు దిమ్మ ఉంటుంది. ఈ లోహపు దిమ్మను వేగంగా వచ్చి ఢీ కొన్న ఎలక్ట్రానులు కంపింపజేస్తాయి. ఫలితంగా విద్యుత్ అయస్కాంత తరంగాల ఉత్పత్తి జరుగుతుంది. రాంట్‌జన్ కనుగొన్న ఎక్స్ కిరణాలు మాంసంగుండా కూడా దూసుకుపోగలవు. రాంట్‌జన్ తన చేతిని నల్లకాగితంలో చుట్టబడిన ఫొటోప్లేటుపై ఉంచి, ఎక్స్ కిరణాలను తన చేతిగుండా పోనిచ్చాడు. అనంతరం ఫొటోప్లేటును కడిగి, ఫొటో ప్రింట్‌ను తయారుచేసేసరికి, అతని చేతి ఫొటోకు బదులు, అతని చేతిలో ఉండే ఎముకల ఫొటో ఏర్పడింది.

1896లో రాంట్‌జన్‌కు ఈ పరిశోధన రాయల్ సొసైటీ యొక్క 'రూమ్‌ఫర్డ్' పతకం తెచ్చిపెట్టింది. 1900 సంవత్సరంలో రాంట్‌జన్ మ్యూనిచ్ విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా నియమితుడయ్యాడు. 1901లో రాంట్‌జన్‌కు భౌతికశాస్త్రంలో నోబెల్ బహుమతి వచ్చింది. 1923లో రాంట్‌జన్ మరణించాడు.

రాంట్‌జన్ బతికి ఉండగానే ఎక్స్ కిరణాలను ఉపయోగించడం మొదలు పెట్టారు. ఎముకలు విరిగిన ప్రదేశాలను నిర్ణయించడానికి, విరిగిన ఎముకల చికిత్స అనంతరం తిరిగి సరిగ్గా అతుక్కున్నదీ లేనిదీ తెలుసుకునేందుకు, క్షయవ్యాధి విషయంలోను తదితర రోగాల నిర్ణయం విషయాల్లోను ఎక్స్ కిరణాలు ఎంతగానో ఉపకరిస్తున్నాయి.

శాస్త్రవేత్తలు స్ఫటికాకృతులను పరిశీలించేందుకు ఎక్స్ కిరణాలను



## పాదముద్రలు సేకరించడం

నేరస్తుల పాదముద్రలను పోలీసులు ఎలా సేకరిస్తారో, మీరు కూడా అలా తయారుచేయవచ్చు. మీ పెరటి ఆవరణలో కొంచెం తేమగా ఉన్న నేలపై మీ పాదాన్ని కొంచెం ఒత్తిడిగా ఉంచాలి. ఆ నేలపై మీ పాదముద్ర ఏర్పడుతుంది. ఒక కార్డుబోర్డును పొడవుగా, కొంచెం వెడల్పుగా ఉండే ముక్కగా కత్తిరించి, దానిని నేలపై పాదముద్ర చుట్టూ ఒక గోడవలే నేలలోకి గుచ్చాలి.

పాదముద్రపై ప్లాస్టర్ ఆఫ్ ప్యారిస్ జల ద్రావణాన్ని పోయాలి. అ ద్రావణం ఎటూ పొర్లిపోకుండా కార్డుబోర్డు గోడ అడ్డుకుంటుంది. పదిగంటలు గడిచే సరికి ఈ ప్లాస్టర్ ఆఫ్ ప్యారిస్ గట్టిపడుతుంది. నేల నుంచి దాన్ని తవ్వితీయాలి. దాని అడుగుభాగంలో పాదముద్ర అచ్చుగా తయారవుతుంది. ఈ అచ్చును టేబుల్‌పై ఉంచాలి. పాదముద్ర పైకి ఉండేట్లుగా పెట్టి, దానిచుట్టూ కార్డుబోర్డుతో గోడవలే ఏర్పాటు చేయాలి. మళ్లీ ప్లాస్టర్ ఆఫ్ ప్యారిస్ జల ద్రావణాన్ని ఈ అచ్చుపై పోయాలి. ద్రావణం ఎటూపొర్లిపోకుండా కార్డుబోర్డు గోడ అడ్డుకుంటుంది.

మళ్ళీ 10గంటలు గడిచే సరికి ప్లాస్టర్ ఆఫ్ ప్యారిస్ గడ్డకడుతుంది. దాన్ని జాగ్రత్తగా అచ్చు నుంచి వేరుచేస్తే ప్లాస్టర్ ఆఫ్ ప్యారిస్‌పై పాదముద్ర తయారై ఉంటుంది.



తెలుసుకుందాం

## మొక్కల సెక్సు ఎలా మారుతుందో...

హార్మోనులు ఎన్నో అద్భుతమైన పనులు చేస్తాయి. మొక్కల చేత అవి తొందరగానూ, ఆలస్యంగానూ పూయించగలవు. మొక్కలు చురుగ్గా పెరిగేట్లు చేయగలవు. మిగతావాటిని పెరగకుండానూ చేయగలవు.

విత్తనాన్ని మొలకెత్తించగలవు లేదా మొలకెత్తించకుండా చేయగలవు. ఇంతకుమించి హార్మోనులు మొక్కల సెక్సును కూడా మార్చగలవు. కాలిఫోర్నియాలోని శాస్త్రవేత్తలు ఈ దిశగా పరిశోధనలు చేసి, విజయం సాధించారు.

కృత్రిమంగా తయారు చేసిన రసాయనం కినిన్ యస్‌డి8339ని ఉపయోగించి ఈ శాస్త్రవేత్తలు ద్రాక్ష మొక్క సెక్సును మార్చివేశారు. సాధారణంగా పెంచే ద్రాక్ష మొక్కలో ఆడ, మగ అవయవాలుంటాయి.

అడవిలో పెరిగే ద్రాక్ష మొక్కలో ఆడమొక్క పుష్పాలు విడివిడిగా మొక్కల్లో కనిపిస్తాయి. 1948లో ఇరాన్ నుంచి ఈ అడవి ద్రాక్ష విత్తనాలను శాస్త్రవేత్తలు సేకరించారు. వీటిని తమ పరీక్షా క్షేత్రాల్లో పండించారు. వీటిలో మార్పును చూసి శాస్త్రవేత్తలు ఆశ్చర్యపోయారు. కొన్ని మొగ మొక్కలకు ఆడామగ పుష్పాలు పూయడం ఒక కొత్త విషయంగా తయారైంది. ఎందుకిలా జరిగింది?

ఏదో హార్మోను ఇందులో పాత్ర వహించింది. ఆక్సిన్‌లు, గిబ్బరిలిన్లు హార్మోనులు రెండూ కూడా పువ్వులు పూసే మొక్కల సెక్సు బాలెన్స్‌లను ప్రభావితం చేస్తాయి. కినిన్స్ అనే హార్మోను ఈ పని చేయగలదని శాస్త్రవేత్తలకు ఆధారం దొరికింది.

మగపుష్పాలు పూసే ద్రాక్ష మొక్కలను కినిన్ యస్‌డి8339లో ముంచడం వల్ల అది ఆడామగ పుష్పాలను పూయడం జరిగింది. ఈ హార్మోను కారణంగా ఈ ద్రాక్ష మొక్కలకు కావల్సిన ద్రాక్షపండ్ల సైజు కూడా పెరిగింది.



Kids Zone

## ఉపాయం

నర్మదా నది తీరంలో ఒక చెట్టుపై ఒక కాకి జీవిస్తూ ఉండేది. ఆ చెట్టు కింద ఒకే పుట్ట ఉండేది. ఆ పుట్టలోని పాము కాకిపాలిటి మృత్యువుగా మారింది. కాకి ఆహారం వెతుక్కోవడానికి వెళ్ళినప్పుడు, ఆ పాము చెట్టు ఎక్కి కాకి పెట్టే గుడ్లను తినేసేది. ఇలా అనేకసార్లు జరిగే సరికి పాముకు సరైన గుణపాఠం చెప్పాలని కాకి అనుకుంది. దీని కోసం ఒక ఉపాయాన్ని ఆలోచించింది. తన పథకాన్ని అమలు చేయడానికి కాకి రాజ అంత:పురానికి వెళ్ళింది. రాణిగారు స్నానం చేస్తుండగా, ఆమె ముత్యాల హారాన్ని ముక్కున కరచుకుని ఎగిరింది. అది చూసిన రాణిగారు, ఆ కాకిని పట్టుకుని హారాన్ని తీసుకురమ్మని పురమాయించింది. భటులు ఆ కాకిని వెంబడించడం మొదలుపెట్టారు. కాకి ఉపాయంగా, భటులు చూస్తున్న సమయంలో ఆ హారాన్ని పాము పుట్టలోకి జారవిడిచింది. దీంతో హారం కోసం భటులు పాము పుట్టను మొత్తం తవ్వారు. పుట్ట చెదిరిపోవడంతో పాము బయటికొచ్చింది. ఎక్కడ కాటేస్తుందో అనే భయంతో భటులు ఆ పామును చంపేసి, ఆపై పుట్టలో ఉన్న హారాన్ని తీసుకుని వెళ్ళిపోయారు. ఉపాయంతో వ్యవహరించడంతో పాము పీడ విరగడైనందుకు కాకి ఎంతగానో సంతోషించింది.



నీతి: అపాయంలోనూ ఉపాయంతో ఎంతో తేలికగా శత్రువుల నుంచి తప్పించుకోవచ్చు.



టావో అంటే మార్గం అని అర్థం. క్రీ.శ 6వ శతాబ్దంలో చైనా తత్వవేత్త టావో టౌజ్ ద్వారా ఈ మతం ఏర్పడింది. లావో కన్ఫ్యూషియస్ కాలం నాటివాడు. చైనా, జపాన్, మలేషియా, హాంకాంగ్, తైవాన్, వియత్నాం దేశాల్లో ఈ మతస్తులు ఎక్కువగా ఉంటారు. టావోయిజాన్ని అనుసరించేవారు ప్రపంచవ్యాప్తంగా సుమారు 50లక్షల మంది వరకు ఉంటారు. టావోయిజం కన్ఫ్యూషిజం, బౌద్ధమతాల మేలు కలయికగా పేర్కొనవచ్చు. తొలిదశలో వీరు విగ్రహారాధన చేసేవారు కాదు. అయితే తరువాత కాలంలో లావోతో పాటు ఇతర మత గురువులను పూజించడం వీరు ప్రారంభించారు. దీంతోపాటు ప్రకృతి శక్తులు అయిన సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, అలల్ని వీరు పూజిస్తారు. మెరుగైన జీవితాల కోసం చక్కటి రుజువర్తనను కలిగి ఉండాలని టావోయిజం బోధిస్తుంది. అందుకే మానవుల రుజువర్తనతో జీవించేందుకు అనేక మార్గదర్శనాలను రూపొందించింది. అబద్ధం చెప్పడం, దొంగిలించడం, మోసాలకు పాల్పడం, హత్యలు చేయడం, మద్యం తాగడం ఈ మతంలో నిషిద్ధం. ఇక పెద్దల మాటకు కట్టుబడి ఉండడం, తల్లిదండ్రులను ప్రేమించడం, క్షమాగుణాన్ని కలిగి ఉండడం, ఇతరుల పనుల్లో సాయం చేయడం, మానసిక, శారీరక దృఢత్వాన్ని కలిగి ఉండడం, శరీరంపైనా, మనస్సుపైనా నియంత్రణను కలిగి ఉండడం, పరోపకార గుణాన్ని కలిగి ఉండడం, స్వార్థం లేకుండా జీవించడాన్ని ఈ మతం ప్రోత్సహిస్తుంది. పిల్లలూ మతం ఏదైనప్పటికీ, ఒక మనిషిగా జీవించాలంటే ఈ గుణాలు తప్పనిసరి. వీటిని పాటించే దిశగా అడుగులు వేస్తారు కదూ...!

# KiDs Zone



ఒక మేఘం సుమారు మిలియన్ పౌండ్ల బరువు కలిగి ఉంటుంది.





మీ జీర్ణవ్యవస్థను మొత్తాన్ని పరిచినట్లయితే అది సుమారు 30 అడుగుల పొడవు ఉంటుంది.

చంద్రునిపై పడే వ్యోమగాముల పాదముద్రలు ఎప్పటికీ చెరిగిపోవు, ఎందుకంటే చంద్రునిపై ఎలాంటి గాలి లేదు కనుక!

మీ శరీరంలోని మొత్తం రక్తం నిముషానికి ఒక్కసారి మీ గుండె గుండా ప్రయాణిస్తుంది.





ప్రతి సంవత్సరం చంద్రుడు భూమి నుంచి ఒకటిన్నర అంగుళాల దూరం జరుగుతున్నాడు.

ఎవరో తరుముతున్నారని అదేవిధంగా ఎత్తయిన ప్రదేశం నుంచి కిందపడుతున్నట్లుగా చాలా ఎక్కువ మంది కలలు వస్తాయంట!

మీ కపాలంలో 300 ఎముకలుంటాయి, అయితే ఎదిగిన తరువాత కేవలం 206 ఎముకలు మాత్రమే కనిపిస్తాయి.

## మీకు తెలుసా....?

## పులి - మేక



ఈ ఆటను గ్రామాల్లో పెద్దలు, పిల్లలు ఎక్కువగా ఆడుతుంటారు. రచ్చబండల వద్ద పులి – మేక ఆడడానికి అవసరమయ్యే నిర్మాణం కనిపిస్తుంటుంది.

ఇద్దరు వ్యక్తులు ఈ ఆట ఆడవచ్చు. దీనికి 3 పులులు, 15 మేకలు అవసరం అవుతాయి. కొంచెం పెద్దగా ఉండే రాళ్ళను పులులుగాను, అదేవిధంగా చిన్నగా ఉండే రాళ్లను మేకలుగాను తీసుకుని ఈ ఆటను ఆడవచ్చు. పైన ఉన్నదాన్ని కొండ, కింద ఉండే గళ్ళను అడవిగా పరిగణిస్తారు. పులులు మూడూ కొండపైనే ఉండాలి. ముందుగా ఒక మేకని అడవిలోకి వదలాలి. దాన్ని చంపేందుకు ఒక పులిని కొండమీద నుంచి అడవిలోకి దించాలి. పులి కదలికలను బట్టి, మొదటి మేకకు కాపుగా మరో మేకను పంపాలి. అవసరాన్ని బట్టి, ఒక్కొక్క పులిని కొండమీద నుంచి దింపవచ్చు, కొండమీదకు పంపవచ్చు. ఇలా పులుల కదలికల్ని బట్టి, వాటికి అందకుండా 15 మేకల్ని క్రాస్‌లపై పేర్చాలి. పులి తన తరువాత క్రాస్ మీద ఉన్న మేక మీదకు పైనుంచి గానీ లేదా కిందకు గానీ, అడ్డంగా గానీ దూకవచ్చు. అలా దూకితే ఆ మేక చనిపోయినట్లు భావించి ఆటలో నుంచి తీసివేయాలి. అయితే ఒక గడి ఎడంగా ఉన్న, లేదంటే వరుసగా ఉన్న రెండు, మూడు మేకల మీద నుంచిగాని పులి దూకకూడదు. అలాగే 15 మేకల్లోనూ మూడు పులుల్నీ కదలకుండా కట్టేయవచ్చు. అలా ఎక్కువ మేకలు చనిపోతే పులుల పార్టీ, పులులు కట్టుబడిపోతే మేకలపార్టీ నెగ్గినట్లు.

# ఆఫ్రికా

భూమి మీద ఉన్న ఏడు ఖండాల్లో ఆఫ్రికా రెండో అతి పెద్ద ఖండం. భూమి మొత్తం విస్తీర్ణంలో 22 శాతం విస్తీర్ణాన్ని కలిగి ఉంది. ఈ ఖండంలో మొత్తం 54 స్వతంత్ర దేశాలున్నాయి. ఆఫ్రికా ఖండంలో మొత్తం వంద కోట్ల మంది జనాభా ఉన్నారు. ఇది ప్రపంచ జనాభాలో 16 శాతం. ఆఫ్రికాలో యువత జనాభా ఎక్కువ. చాలా దేశాల్లో సగం కంటే ఎక్కువ జనాభా 25 సంవత్సరాల కంటే తక్కువ వయస్సు కలిగిన వారు. ఆఫ్రికాలో ఎక్కువ దేశాల్లో అరబిక్ భాషను మాట్లాడతారు. దీనితోపాటు సుమారు 2000 గుర్తింపు పొందిన భాషల్ని మాట్లాడతారు.

ఆఫ్రికా ఖండంలో నైజీరియా, ఈజిప్టు దేశాల జనాభా ఎక్కువ. ఇక విస్తీర్ణం పరంగా సూడాన్ అతి పెద్ద దేశంకాగా, సీషెల్స్ అతి చిన్న దేశం. ఆఫ్రికా ఖండం అనేక చిన్న గిరిజన తెగలకు అలవాలం. సుమారుగా 3000లకు పైగా గిరిజన తెగలు ఈ ఖండంలో ఉన్నాయి.

ప్రపంచంలోనే అతి పెద్దదైన నైలునది ఈ ఖండంలోనే ఉంది. దీని విస్తీర్ణం 4,132 మైళ్ళు. ఇక ప్రపంచంలోకెల్లా రెండో అతి పెద్ద మంచినీటి సరస్సు లేక్ విక్టోరియా కూడా ఈ ఖండంలోనే ఉంది. ఇది సుమారు 26,830 చదరపు మైళ్ళ విస్తీర్ణాన్ని ఆక్రమించి ఉంది. ప్రపంచంలోకెల్లా అతి పెద్ద ఎడారి ఆఫ్రికా ఖండంలో ఉంది. రెండు అమెరికా ఖండాలకంటే కూడా ఇది పెద్దది.

ప్రపంచ పర్యాటకుల్ని ఆకర్షించడంలో ఈ ఖండంలోని ఈజిప్టు ముందువరుసలో ఉంటుంది. వేల సంవత్సరాలనాటి ఈజిప్టు పిరమిడ్లు. ప్రపంచవ్యాప్తంగా పర్యాటకుల్ని ఆకర్షిస్తుంటాయి.

ఆఫ్రికాలోని అన్ని దేశాలూ పేదరికంలో మగ్గుతున్నాయి. ఆఫ్రికా దేశంలో సగటున రోజుకు 30 రూపాయలు సంపాదిస్తుంటారు. ఇక ఆఫ్రికాలో ఎయిడ్స్ వ్యాధి ఎంతో విస్తృతంగా వ్యాపించింది. సుమారు కోటీ డెబ్బై లక్షల మంది ఎయిడ్స్ కారణంగా మరణించారు. మరో రెండున్నర కోట్ల మంది ఎయిడ్స్ వ్యాధితో బాధించబడుతున్నారు. ఇక ప్రపంచవ్యాప్తంగా నమోదయ్యే మలేరియా కేసుల్లో 90 శాతం ఈ ఖండంలోనే నమోదవుతాయి. అదేవిధంగా రోజుకు మూడువేల మంది చిన్నారులు మలేరియా కారణంగా మరణిస్తున్నారు.







H E O Y D B Q U E O V T V T
U U T F B T C M W V R Q D T P I
N H A E G E B W E I O H N G P Q
S W R T M Y W O D I S T T N E I
E R F T F E F E Z P A E R M U E T
H Z N Y X D P T I R E A E F I I W
T T X L L L S C R A F C H F E E O
K I O R U T P U K H G N N B M L
E S H I M T N G V I T I C A A O L
G E T E R N I T Y G E M N I Z X
B S A R F Y E M E K Z I X P T S T
T O G L S Z L S M D N O Y E B U

అడ్డంగా లేదా నిలువుగా లేదా పక్కలకు ఎన్ని ఇంగ్లీష్ పదాలను రూపొందించగలరు?

# విజయవాణి ప్రింటర్స్

("మాబడి", "పాఠశాల" మాసపత్రికల ప్రచురణాసంస్థ)

**చౌడేపల్లె - 517 257, చిత్తూరు జిల్లా**

Phone : 08581 - 256234, 9440804085, Fax : 08581 - 256213 E-mail : vijayavani_printers@yahoo.com

ప్రధానోపాధ్యాయులకు, ఉపాధ్యాయులకు, విద్యార్థుల తల్లిదండ్రులకు...

నూతన విద్యాసంవత్సర శుభాకాంక్షలు!

35 సంవత్సరాలుగా పదవతరగతి విద్యార్థుల కోసం "పాఠశాల" మాసపత్రికను, ఏడవతరగతి విద్యార్థుల కోసం "మాబడి" మాసపత్రికను, అయిదవ తరగతి విద్యార్థుల కోసం "మాబడి" రంగుల పత్రికను క్రమం తప్పకుండా ప్రచురిస్తున్నాం. ఇంతకాలం ఆదరించిన మీకందరికీ కృతజ్ఞతలు.

గడిచిన సంవత్సరం పెద్ద సంఖ్యలో చందాదారులుగా చేరి ఎక్కువ మంది 500 మార్కులకు పైగా సాధించి ఉత్తీర్ణులైనట్లు మాకు తెలియజేసినందులకు సంతోషిస్తున్నాము. ఈ సంవత్సరం ప్రత్యేకంగా ఓ పథకాన్ని ప్రవేశ పెడుతున్నామని తెలియజేయడానికి సంతోషిస్తున్నాం.

**పదవ తరగతి తెలుగు మీడియం విద్యార్థుల కోసం**

విడి ప్రతి రూ. 15/-

సంవత్సర చందా రూ. 150/-



ప్రతి పది చందాలకు ఒక చందా ఉచితం.

అంటే పది చందాలు కట్టినవారికి ప్రతినెలా పదకొండు పుస్తకాలు వస్తాయి.

చందా కట్టిన ప్రతి విద్యార్థికి 75 రూ॥ విలువైన "పార్టు-వి పబ్లిక్ పరీక్షల ప్రశ్నాపత్రాలకు విశ్లేషణసంచిక" ఉచితంగా డిసెంబరు నెలలోగా పంపిస్తాం.

---

**పదవ తరగతి ఇంగ్లీషు మీడియం విద్యార్థుల కోసం**

విడి ప్రతి రూ. 18/-




సంవత్సర చందా రూ. 180/-

ప్రతి ఆరు చందాలకు ఒక చందా ఉచితం.

**ఏడవ తరగతి విద్యార్థుల కోసం**

## మాబడి

తెలుగు మీడియం సంవత్సర చందా రూ. 100/-

ప్రతి పది చందాలకు ఒక చందా ఉచితం.

ఇంగ్లీషు మీడియం సంవత్సర చందా రూ. 120/-

ప్రతి ఆరు చందాలకు ఒక చందా ఉచితం.

---

**అయిదో తరగతి విద్యార్థుల కోసం రంగుల్లో వెలువడుతున్న పత్రిక**

విడి ప్రతి రూ. 7/-

తెలుగు మీడియం మాత్రమే

## మాబడి

సంవత్సర చందా రూ. 70/-

ప్రతి పది చందాలకు ఒక చందా ఉచితం.

చందాలు యం.ఒ.ద్వారా పంపాలి. ఎక్కువ చందాలకు ఒకేసారి పైకం పంపువారు డి.డి.ద్వారా "... ప్రింటర్స్" పేరుతో చిత్తూరులో ఏ బ్యాంకులోనైనా చెల్లుబాటు అగునట్లు పంపవచ్చు.

చందా పంపినవారికి జూన్ నెల 2011 నుండి మార్చి నెల 2012 వరకు మా సొంతఖర్చుతో పోస్ట్ ద్వారా పంపబడును. జూన్ నుండి డిసెంబరు వరకు సిలబస్ ప్రకారం నెలవారీ పాఠ్యాంశములు మరియు జనవరి, ఫిబ్రవరి, మార్చి నెలలలో మోడల్ పేపర్స్ ప్రచురించబడును.

ఎప్పటిలాగే ఈ సంవత్సరం కూడా మీ సహాయసహకారాలు అందించగలరని ఆశిస్తూ...

యం.ఒ.లు చేయాల్సిన చిరునామా

**పాఠశాల / మాబడి, విజయవాణి ప్రింటర్స్**

చౌడేపల్లె - 517257, చిత్తూరు జిల్లా

సదా మీ సేవలో

**సర్కులేషన్ మేనేజర్**

**పాఠశాల / మాబడి**






# గణిత అభ్యసనలో అనుభవం పాత్ర







– మీనా సురేష్

గత శతాబ్ద కాలంనుంచి మన సంస్కృతి, నమ్మకాల్లో, జీవన విధానంలోనూ ఎన్నో మార్పులు చోటుచేసుకున్నప్పటికీ, మన పాఠశాలల్లోని సంప్రదాయ గణిత బోధనా విధానంలో మాత్రం రవ్వంత మార్పు రాలేదు. నేటికీ దశాబ్దాలనాటి పాత బోధనాపద్ధతుల ద్వారానే గణిత అభ్యసన సాగుతోంది. ముఖ్యంగా ప్రాథమిక తరగతుల్లో గణిత బోధనపై ప్రత్యేకమైన శ్రద్ధ లోపించిందనే అనాలి. వాస్తవానికి గణితం అంటే ఏమిటో ఉపాధ్యాయులకూ స్పష్టంగా తెలియకపోవడంతో ఈ సబ్జెక్టు అందరికీ సందిగ్ధంగానే మారింది. సబ్జెక్టు బోధనా విధానాలకు సంబంధించిన అంశాల గురించి వారికి అంతగా తెలీకపోవడం కూడా సందిగ్ధతకు మరో కారణంగా చెప్పవచ్చు.

గణితాన్ని సులభంగా బోధించే మార్గం తెలీకపోవడంతో, సబ్జెక్టు ప్రిపరేషన్ కూడా సరిగా లేకపోవడంతో విద్యార్థుల్లోనూ ఈ సబ్జెక్టుకు సంబంధించిన సందిగ్ధత ప్రభావం వారి విద్యాకాలమంతా కొనసాగుతూనే ఉంటుంది. పాఠశాల స్థాయిలో అత్యధిక మార్కులు సంపాదించిన విద్యార్థులు కూడా కాలేజీ స్థాయికి సిద్ధంగాలేని స్థితిలో ఉన్నారు. పుట్టగొడుగుల్లా పెరిగిపోతున్న ట్యూషన్ సెంటర్లే ఇందుకు అద్దం పడుతున్నాయి. ఒక వ్యక్తి తన జీవితంలో ఎదురవుతున్న సమస్యల్ని ముఖ్యంగా పన్ను లెక్కించడం లేదా పర్సంటేజీ తెలుసుకునే క్రమంలో ఎన్నో ఇబ్బందులకు గురికావడానికి కారణం కూడా గణితం పట్ల ఏర్పడిన సందిగ్ధత ఫలితమే. అసలు గణిత పరీక్ష ఒకరి గణిత అభ్యసనా సామర్థ్యానికి కొలమానం అవుతుందా? అన్న ప్రశ్నకు ఈ కారణాలు, పరిస్థితులు దారితీస్తున్నాయి.

**గణిత ఉపాధ్యాయుల జాతీయ మండలి(ఎన్‌సిటిఎం) గణిత అభ్యసనకు రెండు విభాగాలను గుర్తించింది. అవేమంటే...**



మొదటిది గణితపరమైన ఆలోచన లక్షణానికి ఎక్కువ ప్రాధాన్యతనిస్తుంది. అంటే సమస్యల పరిష్కారం, కమ్యూనికేషన్, రీజనింగ్, సంబంధాల గురించి పేర్కొంటుంది.

రెండోది ప్రత్యేకించి ఒక గణిత అంశాన్ని అంటే సంఖ్యల అవగాహన, అంచనాలు, జామెట్రీ, మెజర్మెంట్స్, స్టాటిస్టిక్స్, ప్రాబబిలిటీ, ఫ్రాక్షన్స్, పాట్రన్స్, సంబంధాలు మొదలైనవి. ఈ రెండోది...

గణిత అంశాలన్నది ఎంతో ప్రధానం. ఎందుకంటే ఆలోచనతో కూడిన గణిత అంశాలన్నీ కూడా ఇందులో సమ్మిళితమై ఉంటాయి. పాఠశాలలో విద్యార్థి గణితం నేర్చుకోవడమన్నది గణితపరమైన ఆలోచనను పెంపొందించే, కొత్త ఆలోచనలు కనుగొనేందుకు తోడ్పడేదిగా ఉండాలి.

గణిత నైపుణ్యం ఎప్పుడూ సంచిత క్రియ అంటే పూర్వ అభ్యసన ఆధారంగానే తదుపరి అభ్యసన కొనసాగుతూ ఉంటుంది. ఉదాహరణకు ఆల్జీబ్రా సిద్ధాంతాల్ని ఆకళింపు చేసుకోవాలంటే అంకగణితానికి సంబంధించిన మౌలిక సూత్రాల్ని క్షుణ్ణంగా నేర్చుకుని ఉండాలి. ఇలా మౌలిక అవగాహనా లోపమే విద్యార్థి అభ్యసనపై భారీ ప్రభావం చూపుతోంది. అంటే విద్యార్థులు కేవలం తరగతిలో ఉపాధ్యాయులు చెప్పే ఫార్ములాలు, సూత్రాలు గుర్తుపెట్టుకోవడం గాకుండా మౌలిక సూత్రాలు క్షుణ్ణంగా తెలుసుకుని ఉండడం ఎంతో అవసరం.

సాధారణ తరగతి గదిలో ఒక సమస్యను పరిష్కరించడంలో అనుసరించాల్సిన పద్ధతులను 'స్టెప్స్'గా రాస్తూ సమాధానాన్ని రాబట్టే మార్గాన్ని రాసుకోవడానికి సూచిస్తాడేగాని... తరగతిలో ఉపాధ్యాయుడు ఆ సమస్య పరిష్కారాన్ని శోధించేందుకు అవకాశం కల్పించడు. 'ఆ అంకెను తీసుకుని కింది వరుసలో అంకెకు కలపండి' అనో లేదా 'ఆ గీతను రెండో వరసలో గీతకు కలపండి' అనో సూచిస్తూ, 'నేను చెప్పినట్టు చేయండి' అని హెచ్చరిస్తూ సమస్యకు సమాధానాన్ని రాయించేస్తారంతే.

దీనికి విరుద్ధంగా అనుభవపూర్వక అభ్యసన విధానం విద్యార్థిని పూర్తిగా భాగస్వామిని చేస్తుంది. ఈ తరహా అభ్యసన ఎంతో విమర్శనాత్మక ఆలోచనను పెంచుతూ అనుభవంతో పాటు, సమస్య పరిష్కారానికి మార్గాల్ని తెలుసుకోవడానికి, అవగాహన పెంచుకోవడానికి వీలుకల్పిస్తుంది. దీనిద్వారా విద్యార్థి ఒక ప్రణాళికను వేసుకోవడం, అందుకనుగుణంగా క్రియను చేపట్టడం, తాను తెలుసుకున్నదాన్ని నలుగురికీ చెప్పడం, ఫలితాన్ని స్పష్టంగా పేర్కొనడం జరుగుతుంది. గణితం ఊహాజనితమైనది గనుక ఈ పద్ధతి ఎంతో ఆమోదయోగ్యం.

విద్యార్థులకు అనుభవపూర్వక అభ్యసనను ప్రాక్టికల్ పద్ధతిలో కల్పించాలంటే అందుకు 'మానిప్యులేటివ్స్' ఉపయోగించాలి. విద్యార్థులు తాకి, కదిలించగలిగే వస్తువులే ఈ మానిప్యులేటివ్స్. ఏదైనా గణిత అంశాన్ని వివరించడంలో వీటిని పరిచయం చేయవచ్చు లేదా ఉపయోగించవచ్చు. మానిప్యులేటివ్స్‌ని ఉపయోగించడంలో విద్యార్థి పూర్తిగా పాలుపంచుకుంటున్నాడా, లేదా అన్నది నిర్ధారించుకోవాలి. బోధించే అంశాన్ని పేర్కొనేందుకు, విద్యార్థుల్లో ఆలోచనాత్మక గణితానికి తగిన స్థాయికి చేరుకునేందుకు తగిన కృత్యాలను కల్పించాల్సిన బాధ్యత ఉపాధ్యాయునిదే. విద్యార్థి స్థిరాభిప్రాయాల నుంచి ఊహించే స్థాయికి అభివృద్ధి చెందడంలో ఎంతో ఉపకరిస్తాయి గనుక మానిప్యులేటివ్స్ వినియోగం ఎంతో అవసరమని పరిశోధకులూ సూచిస్తున్నారు. స్థిరఅభిప్రాయానికి, ఊహకీ మధ్య వారధిగా తరగతి గదిలోని కృత్యాలు ఉండేలా రూపొందించాలి.

అయితే ఇక్కడ ఒక్కటి గమనించాలి... కేవలం మానిప్యులేటర్ల వినియోగంతోనే అంతా వచ్చేయదు, వాటిని వినియోగించడంలో అనుభవం కూడా జోడించాల్సిన అవసరం ఉంది. అప్పుడే అనుకున్న ఫలితాలు సాధించగలుగుతారు. అయితే, మానిప్యులేటర్లను ఎందుకు, ఎలా, ఎప్పుడు, ఎవరితో ఉపయోగించాలి అన్న వాస్తవానికి సంబంధించిన ప్రశ్న తలెత్తుతుతంది. ఈ ప్రశ్నలన్నీ ఉపాధ్యాయుడు స్వయంగా ఆలోచిస్తే వాటికి తగిన సమాధానం లభించకపోదు.

అనుభవపూర్వక అభ్యసన అనేది తరగతిగదిని పూర్తిగా వినియోగించుకోవడం దృష్ట్యా చర్చించాల్సి ఉంటుంది. విద్యార్థులు స్వయంగా గణితం మెళకువలు నేర్వడానికి, స్పష్టమైన ఫలితాలు గ్రహించడానికి వీలుకల్పించేవిగా మానిప్యులేటివ్స్ ఉపయోగంలో అనుభవాలు ఉండాలి. అందుకు అనుసరించే పద్ధతులు పరిశోధనాత్మకంగా ఉండాలి. ఉపాధ్యాయులు మార్గదర్శకులుగా ఉండి విద్యార్థులు చేపట్టే కృత్యాలు ఫలితాలు సవ్యంగా లేకపోయినా, సాధించలేకపోయినా వారికి మద్దతునిస్తూ ప్రోత్సహించాలి. ఈ చర్చను మరింత కొనసాగించేందుకు తరగతి గదిలో సందర్భాన్ని పరిశీలిద్దాం...

అదో తరగతిగది. ఉపాధ్యాయురాలు విద్యార్థులకు లెక్కను ఎలా చేయాలో 'స్టెప్స్' చెబుతూ సూచనలిస్తోంది. విద్యార్థులు పరిశోధించి సమాధానం కనుగొనేందుకు అవకాశమే ఇవ్వడం లేదు. 'ఆ అంకెను తీసుకుని కింది వరుసలో అంకెకు కలపండి' అని లేదా 'ఆ గీతను రెండో వరుసలోని గీతకు కలపండి' అనో సూచిస్తూ, 'నేను చెప్పినట్టు చేయండి' అని హెచ్చరిస్తూ సమస్యకు సమాధానాన్ని రాయించేస్తున్నారు. ఆమె ఆశించిన ఫలితం వచ్చిందని ఆమెకు సంతృప్తి కలగవచ్చు. కానీ విద్యార్థుల మాటేమిటి? ఆమె చేపట్టిన కృత్యంతో విద్యార్థులు ఆలోచించి చేసే గణితాన్ని పొందలేదు.

అలాగాక కొంత ఆలోచించే ఉపాధ్యాయురాలు సూచనలు, హెచ్చరికల స్థానంలో మానిప్యులేటర్లను సద్వినియోగం చేసుకునేది. ఆలోచన ఉన్న ఉపాధ్యాయురాలు సూచనలు తక్కువ ఇస్తూ విద్యార్థులు స్వయంగా చేసి ఫలితాలు సాధించడానికి వీలు కల్పిస్తారు. ఏ నెంబర్‌ను ఎక్కడ వేయాలి, దేన్ని దేనితో కలపాలి, ఎలా చేస్తే సరైన సమాధానం వస్తుందనేది విద్యార్థి స్వయంగా అన్వేషించి తెలుసుకునే అవకాశమిస్తారు.

**సందర్భం 1**




**సందర్భం 2**

ఒక చిన్న తరగతిలో ఉపాధ్యాయుడు కూడిక నేర్పుతున్నాడు. ఉదాహరణకు 3 + 2 = 5 అనేది. విద్యార్థి 3 ఎర్ర చాక్‌పీస్‌లు, 2 తెల్ల చాక్‌పీస్‌లు తీసుకుని వాటన్నింటినీ కూడి సమాధానం 5 అని నిర్ధారించుకున్నాడు. ఈ కృత్యంలో మానిప్యులేటర్లయిన చాక్‌పీస్‌లు అంకెలకు ప్రాతినిధ్యం వహించాయి. ఇలాంటి అనుభవం విద్యార్థి తొలిదశలో ఎంతో మంచిది. ఈ క్రమంలో కొనసాగితే ఉపాధ్యాయులు వేగంగా మున్ముందుకు తీసికెళ్ళే అవకాశముంటుంది. మానిప్యులేటర్ల ద్వారా విద్యార్థుల్లో 'ఆలోచనాత్మక పద్ధతులు' అనుసరించేందుకు ఉత్సాహం పెరుగుతుంది.

విద్యార్థులు ఈ విధంగా కూడికలు చేయడంలో పలు రకాల మెళకువలను సులభంగా తెలుసుకుని అమలుచేయగలుగుతారు. విద్యార్థులు సమాధానాలను రాబట్టడంలో అనుసరిస్తున్న విధానాన్ని పరిశీలిస్తూ కేవలం ప్రోత్సహిస్తుండాలి.

## సందర్భం 3

**పదాలతో కూడిన సమస్య**

ఒక బడిలో 156 మంది మగపిల్లలు, 212 మంది ఆడపిల్లలు ఉంటే మొత్తం ఆ బడిలో విద్యార్థులు ఎందరు ఉన్నట్టు?

ఈ సమస్యను పరిష్కరించేందుకు విద్యార్థులు వెంటనే స్థాన విలువలు లెక్కించే మానిప్యులేటర్లను ఉపయోగిస్తారు.(ఈ మానిప్యులేటర్లకు చిన్న చిన్న గళ్ళుంటాయి. ఇవి ఒకట్ల స్థానానికి ప్రాతినిధ్యం వహిస్తాయి, స్ట్రిప్స్ పదుల స్థానానికి, పెద్ద గళ్ళు మొత్తం 100 ఉంటాయి). ఈ మానిప్యులేటర్లు బయట నుంచి మద్దతునిచ్చేవిగా లేదా ఆలోచనా విధానానికి సహకరించేవిగా... అంటే, విద్యార్థులు తమ ఆలోచనా విధానంలో బయట మద్దతునిచ్చే వాటిని ఊహిస్తారు తప్ప పరిష్కారానికి వాటిని ఉపయోగించరు. అంటే విద్యార్థులకు తాము ఏం చేయాలో తెలుసు. సమాధానం రాబట్టడంలో మానిప్యులేటర్లను మద్దతుగానే భావిస్తారు. ఈ అనుభవాలు బాగానే ఉన్నాయిగాని... ఇందులో గణితపరంగా ప్రత్యేకత లోపించింది. ప్రత్యేకత అంటే గణితపరంగా విద్యార్థి తాను స్వయంగా కనుగొన్నామన్న పరిజ్ఞానం కలగడం.

## సందర్భం 4

విద్యార్థులు 'ఎక్కాల మానిప్యులేటివ్'(ఎక్కాలను నేర్చుకునేందుకు వంకరటింకరగా పుల్లల్ని పేర్చాలి) ఉపయోగిస్తారు. గుణింతం అంటే కూడికనే మళ్ళీమళ్ళీ చేయడానికి దగ్గర మార్గం అనే గణితపరమైన ఆలోచనగా గ్రహించకుంటే, అలాగే గుణించినప్పుడు సంఖ్యలు ఏ విధంగా పెద్దవవుతాయో... ఉదాహరణకు 6ను 4తో గుణిస్తే వచ్చే సంఖ్య 6+6+6+6 కూడితే వచ్చేది సమానమన్నది ఊహించితే 6 ఎంతగా పెరిగిందనేది అర్థమవుతుంది. ఈ జ్ఞానం పొందలేనప్పుడు ఇందుకు ఉపయోగించిన మానిప్యులేటర్లు కేవలం కృత్యం కోసం ఉపయోగించిన వస్తువుల్లానే మిగిలిపోతాయి. ఇటువంటి అనుభవాల్లో, గణిత సూత్రాల అంశాలు నిర్మాణాత్మకంగా ఉపయోగించేందుకు మానిప్యులేటివ్స్ మద్దతునిస్తాయి. అయితే ఇది కూడా సంపూర్ణ గణిత దృష్టితో కూడినది కాదు. చర్చకు దారితీసే అనుభవాలు, మార్పులు చేర్పులకు వీలుకల్పించే వివరణల మార్గమే నిజానికి గణిత అభ్యసనకు సరైన మార్గం.

## సందర్భం 5

చతురస్రం, దీర్ఘచతురస్రం గురించి విద్యార్థులకు బోధించే సమయంలో ఉపాధ్యాయుడు మానిప్యులేటర్లను ఆయా రూపంలో పెట్టి వివరించడంలో అనుభవం మద్దతునిస్తుంది. విద్యార్థి ఎల్–బి = ఏరియా అని పేర్కొంటాడు. ఇది అనుభవం నేర్పిన కనీస అభ్యసన. కొంత ఏరియా విలువ మాత్రమేకాకుండా 4, 9, 16 స్క్వేర్ యూనిట్స్ కూడా రూపొందించవచ్చని, ఏ ఏరియా స్క్వేర్‌నైనా(మానిప్యులేటర్లు పరిమితంగాకుంటే) తెలుసుకోవచ్చని భావిస్తే ఈ అనుభవాలకు ప్రాధాన్యత చేకూరుతుంది. ఈ అనుభవంలో మానిప్యులేటర్లు సిద్ధాంతపరమైన అవగాహనకు మాత్రమే కాకుండా సంపూర్ణంగా అర్థం చేసుకోవడానికి కూడా తోడ్పడ్డాయి. వైశాల్యం స్థిరంగా ఉన్నవాటికి పలురకాల చుట్టుకొలతల దీర్ఘచతురస్రం సాధ్యమనే నిర్ధారణకు వచ్చేట్టు తరగతిలో చర్చ దారితీయాలి. అనేకసార్లు ప్రయత్నించిన తర్వాత, మార్పులు చేర్పులు చేసిన తర్వాత, విద్యార్థులు కూడా తమ మనసులో మాట బయటపెడతారు... ఒక వైశాల్యానికి అతి తక్కువ పేరామీటర్లలో చతురస్రాకారాలు కంపాక్ట్‌గా ఉంటాయన్నది పేర్కొంటారు. ఈ సందర్భంలో మానిప్యులేటర్లను వీలైనంతగా ఉపయోగిస్తారు.

మానిప్యులేటివ్స్ ఉపయోగించి చేపట్టే కృత్యాలకు అనుభవపూర్వక అభ్యసన పర్యాయపదం కాదన్నది పైన పేర్కొన్న ఉదాహరణలు తెలియజేస్తాయి. మానిప్యులేటర్లను తొలిదశలో ప్రాతినిధ్యం వహించేవిగానూ, తర్వాత ఆలోచనావిధానానికి బయటి మద్దతునిచ్చేవి గానూ, ఆ తర్వాత వివరించేందుకు ఉపకరించేవిగానూ తెలియజేసే అనేకానేక కృత్యాలను ఉపాధ్యాయులు విద్యార్థులతో చేయించాలి. అయితే ఈ అనుభవపూర్వక అభ్యసన అనేది మొదట ఒక్కరిద్దరు విద్యార్థులపై దృష్టి పెట్టేదిగా, క్రమంగా తరగతి అంతా ప్రభావితం చేసేదిగా ఉన్నదీ లేనిదీ పరిశీలించాలి. మానిప్యులేటివ్‌లను ఎలా ఉపయోగించాలన్నది పూర్తిగా ఉపాధ్యాయునిపైనే ఆధారపడి ఉంటుంది. తర్వాత క్రమేపీ ఇది విద్యార్థుల బాధ్యత కావాలి. అయితే ఆలోచనాత్మక గణిత అభ్యసన కంటెంట్ గణితంగా రూపాంతరం చెందినప్పుడే అది సాధ్యపడుతుంది.

ప్రాథమిక తరగతుల్లో మానిప్యులేటర్లతో అనుభవపూర్వక అభ్యసన మంచిదే. కానీ, అది ప్రారంభదశలో ఒక్కసారి ఉపయోగించడానికే వీలవుతుంది. అంటే దేనిగురించైనా వివరించడంలో ఎక్కువ సూచనలు చేయాల్సి వచ్చినప్పుడు, రాయించడానికి వీలుగాని అంశాలను చెప్పవలసి వచ్చినప్పుడు, ఆలోచనాత్మక గణిత స్థాయిని సాధించడంలో ఈ మానిప్యులేటర్ల వినియోగం ఉపకరిస్తుంది.



# ఉన్నత పాఠశాల విద్య బోధనాభ్యసనం

- అజేయ కుమార్ బాబు
లెక్చరర్, DIET, కర్నూలు

వ్యక్తిలో రెండురకాలైన ఎదుగుదలలు కనిపిస్తాయి. ఒకటి ప్రకృతి పరమైనది. ఇది జన్యు సంకలనం. రెండోది ప్రయత్నపరమైనది. అనగా... శిక్షణ, అభ్యసనతో కూడుకున్నది. ప్రయత్నపూర్వకమైన అభ్యాసాల, అనుభవాల అభ్యసన ప్రక్రియ నిర్వహణ వేదిక పాఠశాల. నేర్చుగా నేర్పించడం బోధన అయితే, సామర్థ్యం సాధన చేయడం అభ్యసన. అందుకు అవసరమైన చర్య, ప్రతిచర్యలు వరస సోపానాలే... బోధనా అభ్యసన ప్రక్రియలు. ఉన్నతపాఠశాల విద్యలో సామర్థ్యాల సాధనకు శాస్త్రీయమైన విధానం నిర్మాణాత్మక అభ్యసనం. అందుకు ప్రాథమిక, ప్రాథమికోన్నత స్థాయి విద్య పునాది

ఉన్నత పాఠశాలలోని విద్యార్థులు పూర్వ కౌమారులు. వీరు 13, 14 సంవత్సరం నుంచి 17 సంవత్సరాల వరకు ఉంటే టీనేజ్ దశ. ఈ దశలోని వికాసాంశాలు బోధనాభ్యసనంలో విద్యా ప్రాముఖ్యతగా ఉంటుంది.



**1. శారీరక వికాసం**

ఎత్తు, బరువులే కాకుంటే అంతర్గత వ్యవస్థలు, వికాసం చెందుతాయి.
హార్మోనుల ప్రభావం ఎక్కువ.
మార్పులు వయస్సు, శరీర నిర్మాణంలోనే కాదు... బాధ్యతలు, విధులు ఆధికారాల్లోనూ వస్తాయి.
అందం పట్ల అనుకూల వైఖరి, గుర్తింపు కోరుకోవడం.

**2. మానసిక వికాసం**

ప్రజ్ఞా వికాస దశ
ఆలోచనలు, వివేచనతో భావోద్భవంలో మార్పు
తార్కిక ఆలోచన, అమూర్త వివేచన, ఏకాగ్రత పెరుగుదల,
ఊహాశక్తి బాగా పెరగడం

**3. ఉద్వేగ వికాసం**

ఒత్తిడితో కూడుకున్న దశ
ఉద్వేగ తీవ్రతల వల్ల అవివేకంతో కూడిన ప్రవర్తన
అనుభవం గడించే కొలదీ ప్రవర్తనలో పరిపక్వత సాధిస్తారు.
విరోధ స్వభావం, నిరసన భావాలు కలిగి ఉంటారు.

**4. సాంఘిక వికాసం**

సాంఘిక కార్యక్రమాల్లో భాగస్వామ్యం.
కొత్త సమూహాలను ఏర్పరుచుకోవడం, సహవసించడం.
కచ్చితమైన విలువలు, ప్రమాణాలు ఏర్పరుచుకుంటారు
నాయకత్వ లక్షణాలు ప్రదర్శిస్తారు.

**5. నైతిక వికాసం**

నైతిక నియమనిబంధనలు పెంపొందించుకోవడం
వారి ప్రవర్తనను వారే నియంత్రించుకోవడం
నియామకం, నిబంధన, నియంత్రణ ద్వారా
నైతికత సాధించడం



### జీన్ పియాజే

వికాసాన్ని గురించి విస్తృత పరిశోధనల ద్వారా వికాస దశల్ని వివరించారు. పిల్లల జ్ఞానాత్మక వికాసం ఆయా దశల్లో వ్యవస్థీకరించే దశల్ని తెలియజేశాడు. వికాసం అనేది అభ్యసనం, ప్రత్యక్షం, స్మృతి, ఆలోచనల మానసిక చర్య. పియాజే వికాస దశలో అమూర్త ప్రచలన దశ ఒకటి. ఈ దశలోని పూర్వ కౌమారులు అమూర్త విషయాల పట్ల కూడా వికాసాన్ని కలిగి ఉంటారు. ముఖ్యంగా

- అమూర్త ఆలోచనల్ని మూర్త అంశాలుగా మార్చడం
- శాస్త్రీయమైన ఆలోచనల్ని కలిగి ఉండడం
- ఊహించిన ఫలితాలను నిరూపించడం లేదా తిరస్కరించడం కోసం ప్రయత్నిస్తారు.
- కార్యకారక సంబంధం గురించి ఆలోచించడం, ఒక సమస్యకు అనేక మార్గాలుంటాయని గ్రహించడం. ఇవి నిర్మాణాత్మక అభ్యసనాన్ని ప్రోత్సహిస్తాయి.

పాఠశాల విద్యలో పిల్లల స్వభావాన్ని బట్టి, వికాసాంశాలను బట్టి, బోధనాంశాలు, బోధనా పద్ధతుల ఏర్పాటు ఉంటుంది. ఉన్నత పాఠశాల విద్యలో విద్యార్థి మూర్త విషయాలతోపాటు, అమూర్త విషయాలను కూడా కొంతవరకు గ్రహించగలుగుతాడు. ఈ దశలో గత అనుభవాల ఆధారంగా తన ఆలోచనల్ని క్రమబద్ధీకరించుకుంటూ నిర్మాణాత్మకంగా అభ్యసించడానికి ప్రయత్నిస్తాడు.

### బోధనా విధానం

విద్యార్థి పూర్వభావనలు, అనుభవాలను, అవగాహన మొదట నిర్ధారించబడుతుంది. దీని ఆధారంగానే నూతన విషయాన్ని బోధించడానికి ప్రయత్నిస్తారు. ఒకవేళ అటువంటి భావనలు, అనుభవాలు లేకుంటే వాటిని తరగతి గదిలో పరిచయం చేయడం, బోధన "పూర్వ భావనాధారితం"గా ఉంటుంది.

### పిల్లలు ఎప్పుడు నేర్చుకుంటారు ?

తమకు అవసరం అనుకుంటే తమకోసం తామే పాల్గొంటారు. నేర్చుకోవడానికి ఆసక్తి కనబరుస్తారు. అప్పుడు విషయం ఎంత కష్టమైనా అభ్యసించడానికి సిద్ధపడతారు. ఈ తపనను కలిగించి, అవసరాన్ని సృష్టించి అభ్యసనను ప్రేరేపించేలా బోధన సాగుతుంది.

### పిల్లలు ఎలా నేర్చుకుంటారు ?

నేర్చుకోవడం ఒక మానసిక ప్రక్రియ. ఇంద్రియాల సంవేదనాల వల్ల నాడీ కణజాలం ఉత్తేజానికి లోనవుతుంది. ఈ చర్య, ప్రతిచర్యల వల్ల కొత్త సంబంధాలు ఏర్పడతాయి. తద్వారా ఈ విషయాంశం వికాసం చెందుతుంది. విద్యార్థి తన అంతర్గత శక్తులను వినియోగించుకుని కొత్త సంబంధాలను ఏర్పరుచుకునేలా తరగతి గదిలో నియోజనాలు ఇవ్వబడతాయి.

### విద్యార్థి ఎప్పుడు ఆలోచిస్తాడు ?

సమస్య ఎదురైనప్పుడు, సమస్య పరిష్కారాల కోసం ఆలోచిస్తాడు. ఈ సందర్భంలో వారివారి అవగాహన, అనుభవాల ఆధారంగా భిన్నంగా ఆలోచిస్తాడు. ఆ ఆలోచనలు నిర్మాణాత్మకంగా మలిచేలా తరగతి గది నిర్వహణ ఉంటుంది.

విద్యార్థి ప్రగతిని గుర్తిస్తూ తగిన ప్రోత్సాహాన్ని ఇవ్వడం ద్వారా విద్యార్థి మరింతగా అభ్యసించడానికి యత్నిస్తాడు. ఇందుకు విద్యార్థిలోని నిగూఢమైన శక్తులను గుర్తించి, అవసరమయ్యే అవకాశాలను ఉపాధ్యాయుడు కల్పిస్తాడు. అందుకు అవసరమైన భాగస్వామ్య విధానాలను బోధనలో భాగంగా రూపొందిస్తారు. బోధన మొత్తం " విద్యార్థికేంద్రితం" అంటే విద్యార్థి అవసరాలు, సామర్థ్యాలు, అభిరుచులు ఆధారంగా కృత్య నిర్వహణ ద్వారా జరిగే ప్రక్రియ. ఇందుకు అన్వేషణ, నియోజన, ప్రకల్పనా, చర్చా పద్ధతులు కొన్ని ఉదాహరణలు.



**బోధనాభ్యసన ప్రక్రియలు**

ప్రక్రియ అనగా వరస సోపానాలు. ఉన్నత పాఠశాల బోధనాభ్యసన వరస సోపానాలతో కూడిన నిర్మాణాత్మక అభ్యసనం తరగతిలో కొనసాగుతుంది. అవి వరుసగా...

ప్రస్తుత విషయాంశంలో వికాసం సాధించాలన్నా, విస్తృత పరుచుకోవాలన్నా ఆ విషయానికి సంబంధించి పూర్వ అవగాహన విద్యార్థి కలిగి ఉండడం అవసరం. ఈ పూర్వ పరిజ్ఞానం పునాది వంటిది. దీని ఆధారంగానే నిర్మాణాత్మక అభ్యసనం ఉంటుంది. అందుకు ఉపాధ్యాయుడు ప్రశ్నించడం, చర్చించడం ద్వారా గుర్తిస్తాడు.

పూర్వభావనలను, అనుభవాల రంగాన్ని నిర్ధారించి, దానికి అనుగుణంగా ప్రస్తుత పాఠ్యాంశ భావనలను అనుసంధానిస్తారు. అనగా పూర్వ అవగాహనల ఆధారంగా తెలుసుకోవాల్సిన భావనలను బోధించి నిర్మాణాత్మకంగా అభ్యసింపజేయడం. అందుకోసం ఉపాధ్యాయుడు అభ్యసన కృత్యాలను విద్యార్థులకు ఇస్తాడు.

పాఠ్యాంశాలు విద్యార్థిని ఆలోచింపజేసేవిధంగా ఉండడం, క్రమబద్ధీకరించేలా విద్యార్థి వాటికి భిన్నమైన రూపాలను ప్రదర్శిస్తాడు. ఉపాధ్యాయుడు ఇచ్చే సూచనలు, మార్గదర్శకం ఆధారంగా స్వేచ్ఛగా విద్యార్థి ఆయా ప్రాజెక్టులు, అసైన్‌మెంట్లు, అధ్యయనాలను చేపడతాడు. ఈ సందర్భంలో తన అనుభవాల అవగాహన ద్వారా భిన్నమైన పరిష్కార మార్గాలు చూపిస్తాడు. తన ఆలోచనలకు(అమూర్త) నిర్మాణాత్మక రూపాన్ని ఇస్తాడు. విద్యార్థి మానసిక వికాసం, ఆలోచనల క్రమబద్ధీకరణలో తోడ్పడుతుంది.

సాంఘిక వికాసం వల్ల తన తోటి విద్యార్థులతో విషయాన్ని గురించి కలిసి ఆలోచించడం, మాట్లాడటం, చర్చించడం, అనుభవాలను పంచుకోవడం ద్వారా కొత్త విషయాలను అభ్యసిస్తాడు. విద్యార్థుల మధ్య కొనసాగే ఈ పరస్పర చర్యలు భాగస్వామ్య అభ్యసనానికి దారితీస్తాయి. ఇలా కలిసి ఆలోచించడం, సాధనకు ప్రయత్నించడం విద్యార్థుల్లో ఆత్మవిశ్వాసాన్ని నింపుతుంది. అట్టి అభ్యసనం నిర్మాణాత్మకంగా ఉంటుంది.

విద్యార్థి అభ్యసనలో భాగంగా,తన ఆలోచనల్ని క్రమబద్ధీకరిస్తూ, ఒక రూపాన్ని ఇస్తాడు. అందుకు విద్యార్థి మౌఖిక, లిఖిత, ప్రదర్శనా నిర్వహణ పద్ధతులను ఎంపికచేసుకుంటాడు. అవసరతను బట్టి వ్యక్తి జట్టు, సమూహాలుగా విద్యార్థులు ఏర్పడవచ్చు. బహిర్గతమైన స్పందనలను ఉపాధ్యాయుడు మూల్యాంకనం చేస్తాడు. విద్యార్థి ఆలోచనల్ని అంచనా వేస్తాడు. అవసరాన్నిబట్టి కూడా మార్గదర్శకాలను కూడా కల్పిస్తారు.

నిర్మాణాత్మక ప్రదర్శన, స్పందనల ఆధారంగా మూల్యాంకన ప్రక్రియలో భాగంగా విద్యార్థులు ఏమి గ్రహించారో నిర్ధారిస్తారు. మరింత మెరుగుపరచడం కోసం చర్యల్ని చేపట్టవచ్చు. విషయాన్ని అభ్యసించే విధానాన్ని అభివృద్ధి పరచవచ్చు. తన బోధనాభ్యసన ప్రక్రియలో మార్పును ఉపాధ్యాయుడు గుర్తిస్తాడు. పిల్లలు స్వతఃసిద్ధంగా జరిపే ప్రతిచర్యల ఆధారంగా నేర్చుకుంటారు. పిల్లల్లో అన్వేషించే కాంక్షను, నైపుణ్యాన్ని పెంపొందించడానికి వివిధ కృత్యాలను ప్రణాళికాబద్ధంగా అమలుచేస్తే కొత్త విషయాలు ఆవిష్కరిస్తారు. ఆలోచింపజేయడం, అనుభవాల ఆధారంగా కొత్త విషయాలను అనుసంధానిస్తూ నిర్మాణాత్మకంగా అభ్యసించడం చేయగలిగితే... విద్యార్థి ఉన్నత విద్యలోనూ, వృత్తివిద్యలోనూ మంచి పట్టు సాధిస్తాడు.






ఎమెస్కో బుక్స్




-2-7 బానూ కాలనీ, గగన్‌మహల్ రోడ్డు,
దోమలగూడ, హైదరాబాద్-500 029
ఫోన్ : 040-23264028
email : emescobooks@yahoo.com
www.emescobooks.com

ప్రాచీనాంధ్ర ప్రబంధ సాహిత్యం

వచన వేదాలు

ఉపనిషత్తులు

బ్రాహ్మణాలు

పురాణాలు

ప్రముఖుల జీవిత చరిత్రలు

వ్యక్తిత్వ వికాసం

తత్త్వశాస్త్రం

పిల్లలకోసం అందమైన
రంగుల బొమ్మల పుస్తకాలు

సుప్రసిద్ధ రచనల
తెలుగు అనువాదాలు

విజ్ఞాన సర్వస్వాలు

నిఘంటువులు

సాహిత్యం

నవలా సాహిత్యం

జ్యోతిష్యశాస్త్రం

మేజిక్ పుస్తకాలు

కార్టూన్‌లు, జోక్‌లు

వైద్య గ్రంథాలు

# అక్షరాలతో ట్వంటీ



**Y. Mallikarjun Rao**
handwriting56@gmail.com
Ph: 9849546608

అవును. ఆంగ్ల అక్షరమాలతో 'టీ' అనే అక్షరం సంఖ్య ఇరవై. గ్రాఫాలజిస్టులు 'టీ' గురించి, మనసు పొరల్లో అవి చేసే కదలికల గురించి ఎంతో పరిశోధన చేశారు. మరో విషయం. ఇంగ్లీష్‌లో ఉన్న 26 అక్షరాలలో ఎక్కువసార్లు వచ్చే అక్షరం ఇదే. ప్రతి వెయ్యి అక్షరాలలోనూ సగటున 127 'టీ'లు ఉంటాయట. ప్రపంచంలోని చాలామంది చేతిరాత విశ్లేషకులకు కూడా 'టీ' అక్షరం మీద మక్కువ ఎక్కువే. చూడటానికి ఎంతో సాధారణంగా. నిరాడంబరంగా ఓ నిలువు గీత, అమాయకంగా అడ్డగీతల కలయితో తయారైన ఈ 'టీ'తో ఎన్ని వెరైటీ'టీ'లో... ఒక్కొక్క రకమైన 'టీ'లో ఒక్కొక్క రకమైన మనోభావం. చిత్తగించండి. ఈ ఇరవయ్యో అక్షరం వివరం....

t gate

'టీ' అక్షరం మీద రాసే అడ్డుగీతను కాస్త పొడవుగా ఒత్తిపెట్టి రాసేవాళ్లు, ఏ పనినైనా తలపెట్టడంలోనూ, దాన్ని సాధించడంలోనూ, సిద్ధహస్తులు. మధ్యలో వచ్చే సమస్యలు, ఒడుదడుకులు చాకచక్యంగా అధిగమించడం వీరి నైజం. పనిలోని ఆనందాన్ని వెతుక్కునే కోవలోకి వీరు వస్తారు. ఉత్సాహంగా కనపడుతూ, వీరితో ఉన్నవారికి కూడా ఆ ఉత్సాహాన్ని బట్వాడా చేయగలుగుతారు.

t ta

అడ్డగీతను గొడుగు ఆకారంలో రాసేవారికి వారి మనోభావాల మీద, మనస్తత్వం మీద మంచి పట్టు ఉంటుంది. ఆచితూచి అడుగేస్తారు. అంత తేలికగా వీరు ఎగిరి గంతు వేయరు. అలాగని ప్రతి చిన్న విషయానికీ నిరుత్సాహపడిపోయి, కన్నీరు పెట్టరు. 'టఫ్'గా ఉంటారు.

t it

అడ్డగీతను చాలా తేలికగా 'ఉందా లేదా' అని రాసేవారు, లక్ష్యాలను తేలికగా తీసుకుంటారు. నిర్లక్ష్య ధోరణి ఉంటుంది. పరుల సొమ్ము(తండ్రి లేదా ఇతర కుటుంబ సభ్యులది) లెక్కకు మించి ఖర్చుచేస్తారు. వారికన్నా తక్కువ వయస్సువారితో లేదా తక్కువ హోదా లేదా తక్కువ లోకజ్ఞానం ఉన్నవారితో స్నేహం చేయడానికి ఇష్టపడతారు.

t dot

అడ్డగీత కిందకు పడిపోయేలా ఉంచి రాసేవారు... అందరికంటే అధికులమని భావిస్తుంటారు. ఇతరులంతా తెలివితక్కువవారని, తమకే అన్నీ తెలుసనే లోకంలో విహరిస్తూ అవకాశం వచ్చినప్పుడల్లా వారి ఆధిక్యాన్ని కనీసం మాటల ద్వారానైనా తెలియజేసేందుకు ప్రయత్నిస్తారు.

చేతినిపైకి ఎత్తకుండానే ఒకే గీతలో 'టీ' ని రాసే క్రమంలో దానిని నక్షత్రంలా రాసేవారు చాలా సున్నిత మనస్కులు. చీమ చిటుక్కుమన్నా నిద్రలో నుంచి లేస్తారు. అందరూ తనగురించే మాట్లాడుకుంటున్నారనే ఊహల్లో ఉంటూ వారిని వారే తక్కువ చేసుకుంటారు.

t bat

ఇది 'టీ' యా లేదా 'ఏ'నా అనే సందేహం కలిగేలా నిలువు గీతను రెండుగా చీల్చి మధ్యలో అంతదూరంతో రాసేవారు... మొండివైఖరి కలిగి ఉంటారు. వితండవాదం చేస్తారు. తాము పట్టిన కుందేలుకు మూడే కాళ్ళు అని వాదించే నైజం వీరిది.

---

t t total

అడ్డగీతను కుడివైపుకు రాసేవారికి మనోనిబ్బరం, ఓపిక తక్కువగా ఉంటాయి. త్వరగా కోప్పడతారు. ఈ మాత్రం పని కూడా చేయలేరా, అని పరులను వేలెత్తి చూపడం, చిరాకు పడడం చేస్తుంటారు. ఆ గీత కుడివైపే ఉంటే, కాస్త పై వైపుకు ఉన్నట్లుగా రాస్తే కోపం మరీ ఎక్కువగా ఉంటుంది.

---

t next

అడ్డగీతను అక్షరానికి ఎడమవైపు రాసేవారు వాయిదా మనస్తత్వాన్ని కలిగి ఉంటారు. తరువాత చేద్దాంలే అనిగానీ, ఇప్పుడే అంత తొందరమేమిటనిగానీ, వారి చుట్టుపక్కలవారితో కూడా 'వాయిదా'కు ప్రభావితం చేయగలుగుతారు. బద్ధకస్తులు కూడా.

---

t time

అడ్డగీతను బాగా కిందభాగంలో రాసేవారు... ఆత్మన్యూనత భావనతో ఉంటారు. వారిని వారే కించపరుచుకుంటారు. విజయం అనేది ఫలానా వారికి సొంతం... మనకు కాదనే భ్రమతో జీవిస్తుంటారు. వీరిలో ఆత్మగౌరవం శాతం తక్కువగా ఉంటుంది.

---

t test

చాలా చిన్న అడ్డగీతతో 'టీ' రాసేవారు కృత్రిమంగా ఉంటారు. మానవ సంబంధాల విషయంలో తెచ్చిపెట్టుకున్న నవ్వుతోను, చాలా హుందాగా కనిపించాలని ముఖంలో గాంభీర్యాన్ని పులుముకోవడం చేస్తారు.

---

t white toy

నిలువు గీతలో వెడల్పాటి 'లూప్' రాసేవారు సున్నితంగా ఉంటారు. ప్రతివిషయాన్నీ మనస్సుకు తీసుకోవడం వీరి స్వభావం. వారు అలా ఎందుకు అన్నారబ్బా..... నేను అలా చేసి ఉండకపోతే బాగుండేదే.... అని అవసరమైన వాటి గురించి, అనవసరమైన వాటి గురించి కూడా ఆలోచిస్తుంటారు.

---

t get

అడ్డగీతను బాగా పై భాగంలో రాస్తూ ఎడమవైపు, కుడివైపు భాగాలు దాదాపుగా సమానంగా రాసేవారు ఉన్నతమైన ఆలోచనలు చేస్తారు. నిండుకుండలా తొణికిసలాడకుండా, ఆత్మవిశ్వాసానికి నిర్వచనంలా ఉంటారు. వీరికి తెలియకుండానే వీరిని చాలామంది అభిమానించేస్తుంటారు. ఎప్పటికప్పుడు విషయ పరిజ్ఞానాన్ని పెంపొందించుకోవడానికి, తాను ఉన్న వృత్తిలో నైపుణ్యాన్ని పెంపొందించుకోవడానికి ఉత్సాహాన్ని చూపిస్తారు.

---

l bil

ఏదీ... అడ్డగీత ఎక్కడా...'లేదు' అమ్మో అడ్డగీతను వదిలేసి 'టీ'ని రాస్తే ఎల్ అయిపోదూ. ఆ విషయం అలా ఉంచితే గ్రాఫాలజీ ప్రకారం అడ్డగీతలు లేని 'టీ'లు రాసేవారు యధాలాపంగా ఉంటారు. మనిషి ఇక్కడ, మనస్సు ఎక్కడో అన్నట్లుగా ప్రవరిస్తుంటారు. ఆత్మవిశ్వాసానికీ, వీరికీ మధ్య చాలా దూరం ఉంటుంది.

పైనున్న 13 'టీ'ల్లో మేటి 'టీ'లను ఎంచుకొని మీరు రాసే విషయంలో వాటిని జొప్పించండి చాలు(సమస్యాత్మకమైన వాటిని రానివ్వకుండా చూసుకోవడంలో తగిన జాగ్రత్త వహించాలి).

ఆ మంచి 'టీ'లకు సంబంధించిన సులక్షణాలు సలక్షణంగా మీ మనస్తత్వంలో చోటుచేసుకుంటాయి. అలా ఈ 13వ సంవత్సరం ప్రారంభించేయండి. హ్యాపీ 13 టూ యూ.



తినకుంటే బలం ఎలా వస్తుంది? బలం లేకుంటే ఎలా చదువుతావు? ఏం పనిచేస్తావు? ఈ ప్రశ్నలు సర్వ సాధారణంగా ఇంట్లో పెద్దల నుంచి అనాదిగా వింటున్నవే. కానీ స్కూలు పిల్లలు, యువత కూడా పెద్దల మాటను సరిగా పట్టించుకోవడం లేదు. అసలు తిండికీ చదువుకీ సంబంధమేంటని ఎదురు ప్రశ్నలు వేస్తుంటారు. బలమైన పౌష్టికాహారం తింటేనే ఆరోగ్యంగా ఉండగలుగుతాం. అప్పుడే ఏదైనా చేయగలిగేది అన్నది అర్థం చేసుకోవాలి. అందుకే ఇటీవలికాలంలో బడిలోనూ పౌష్టికాహారం తీసుకోవడంలో లాభనష్టాల గురించి తెలియజేయాలన్న ఆలోచన వచ్చింది. ఇది హర్షణీయం. అసలే కాలుష్య వాతావరణంలో పెరుగుతున్న పిల్లలు కనీసం బలమైన తిండీ తినకుంటే పెద్దయ్యాక అనారోగ్యానికి గురవుతారు. అందువల్ల బడికి వెళ్ళే పిల్లల పౌష్టికాహారం గురించి తెలుసుకోవడం ఎంతో అవసరం. నిజానికి ఈ అంశాన్ని క్లాస్‌రూమ్‌లో పిల్లలకు కనీసం కొద్దిసమయమైనా హెచ్చరించడం చాలా అవసరం. పిల్లలు చాలా సమయం బడిలోనే గడుపుతుంటారు. బయటికి వెళ్ళాక ఎలాంటి ఆహారం తీసుకోవాలన్నది తెలియజేయడానికి ఎంతో సమయమూ ఉంటుంది. అందువల్ల పిల్లలకు చదువుతోపాటు, ఈ జ్ఞానం కూడా బోధించాల్సిన అవసరాన్ని డాక్టర్లూ చెబుతున్నారు.

### పిల్లల పౌష్టికాహార స్థాయి

దేశంలోని చాలాప్రాంతాల్లో ఇప్పటికీ సరైన ఆహారం తినక, కలుషిత వాతావరణంలో ఉంటున్న బాలబాలికల గురించి సర్వేల్లో తెలుసుకుంటున్నాం, వార్తల్లో వింటున్నాం. మరి మన పిల్లల గురించి పట్టించు కుంటున్నామా అని ప్రశ్నించుకోవాలి. దేశానికి మంచి ఆరోగ్యకరమైన తరాన్ని అందించాలని అందరూ సూచిస్తుం టారేగాని పౌష్టికాహారం ఎందరికి, ఏ విధంగా అందుతుందన్నది ఆలోచించడం లేదు. ఐరన్, కాల్షియం, ఇతర పౌష్టిక మద్దతునిచ్చేవి లేని ఆహారాన్ని తింటున్న పిల్లల సంగతేంటి? వాటిని అందిస్తున్నామా లేదా? అదే వారి శారీరక, మానసిక అభివృద్ధికి కీలకమన్నది తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు గుర్తిస్తున్నారా? 2005-06లో జాతీయ కుటుంబ ఆరోగ్య సర్వే(ఎన్ఎఫ్హెచ్ఎస్ 3) నిర్వహించారు. దేశంలో 46 శాతం పిల్లలు పౌష్టికాహార లోపంతో అనేక అనారోగ్య సమస్యలకు గురవుతున్నారని తేలింది. మరీ దారుణమేమంటే 80 శాతం పిల్లలు రక్తహీనతతో బాధపడుతున్నారు. అంటే పిల్లలకు సమతుల ఆహారాన్ని అందించాల్సిన బాధ్యత గుర్తెరగాలి.

### పౌష్టికాహారం, క్లాసులో నైపుణ్యం

పిల్లలు పౌష్టికాహారం గురించి తెలుసుకోవాలి. పిల్లలు చదువులో మెరికల్లా తయారుకావాలంటే ఆరోగ్యం, మంచి ఆహారం అవసరాన్ని ఉపాధ్యాయులు గుర్తించి అవి అనుసరిస్తున్నదీ లేనిదీ పరిశీలించాలి. ఒకే క్లాసులో చదువుతున్న పిల్లల మధ్య చదువులో తేడాలు మరింత పెరగడానికి వారి ఆరోగ్యం కూడా కారణం కావచ్చు. బాగా చదవలేకపోవడానికి మంచి ఆహార లోపం కావచ్చు. బలమైన ఆహారాన్ని తీసుకునే స్థోమత లేని కుటుంబాల్లో పిల్లలు చదువులోనూ అంతగా రాణించలేరన్నది నిరూపించదగ్గదే. కానీ అలా ఎందుకు జరుగుతుందనేది గ్రహించాలి. అందుకే బడిలో పాఠాలతోపాటు, మంచి ఆహారం తీసుకోవడం, ఆహార అలవాట్లను అనుసరించాల్సిన ప్రాధాన్యతను పిల్లలకు తెలియజెప్పడం ఉపాధ్యాయులు బాధ్యతగా స్వీకరించాలి. ఆహార లోపం వల్లే చదువు మీద దృష్టి, నిలకడగా చదవడమన్నది పోతుంది. దీంతో మంచి విద్యార్థి కూడా మార్కులు సాధించలేక వెనకంజలో పడుతుంటారు. పౌష్టికాహారంలో ఏది తక్కువైనా మెదడు చురుకుదనం తగ్గుతుందని, నడతలోమార్పు వస్తుందని అంటారు. అంతేగాక చిరాకుపరాకులకు గురవుతారు.



### ప్రత్యేక బోధన అవసరం

పిల్లలకు మంచి ఆహారం విలువ, దాన్ని ఎలా తీసుకోవాలి, విటమిన్లతోకూడిన ఆహారం గురించి వివరించాలి. సైన్స్ క్లాసులో వీటిని వివరించడం అత్యంత ఆవశ్యకం. ఆహారం విషయంలో అనుసరించాల్సిన నియమాలు, తీసుకోవాల్సిన జాగ్రత్తలు పిల్లలకు బోధించాలి. పెద్ద పెద్ద పాఠశాలల్లో, పబ్లిక్ స్కూళ్ళలో అంగన్వాడీ కార్యకర్తలు లేదా ఆయా ప్రాంతాల్లో ఆరోగ్య కార్యకర్తలను పిలిపించి ఆహారం ప్రాధాన్యతను తెలియజేస్తుంటారు. ఇదే పద్ధతిని అన్ని పాఠశాలల్లోనూ చేపట్టాలి. ముఖ్యంగా మురికివాడలకు దగ్గరగా ఉన్న పాఠశాలల్లోనూ, బడుగువర్గాల పిల్లలు చదువుతున్న పాఠశాలల్లోనూ ప్రత్యేకించి బోధించాలి. అప్పుడే వారికి ఆహారంలో బలం గురించి తెలుస్తుంది. అంతేగాక మధ్యాహ్న భోజనంలో ఎక్కువ కూరగాయలు, బలాన్నిచ్చే ఆహార పదార్థాలే ఉండేట్టు చూడాలి. వెనుకబడిన తరగతులకు చెందిన పిల్లల ఆహారం విషయంలో ఇన్ని జాగ్రత్తలు పాటించే అవకాశం ఉండదు గనుక క్లాసులో ప్రతి విద్యార్థీ ఆహార విషయంలో ఉపాధ్యాయులు కాస్తంత శ్రద్ధ తీసుకుంటే చదువులో మంచి ఫలితాలు సాధించవచ్చు. సహజంగా పిల్లలు నూనె వస్తువులకు, బిస్కెట్లకు మొదలైనవాటికి ఆకర్షితులవుతారు. వాటి స్థానంలో అరటి పండ్లు, పాలు అందించాలి. పౌష్టికాహారం గురించిన పాఠ్యాంశం లేకపోయినా, దాన్ని గురించి పిల్లలకు అర్థమయ్యే రీతిలో సమయం తీసుకుని ఉపాధ్యాయులు బోధించాలి.



### గణితం క్లాసులోనూ బోధించవచ్చు

క్లాసులో పిల్లలు ఉదయం ఏం తినివచ్చారని ప్రశ్నించాలి. అప్పుడు వారిలో ఎవరు నిజమైన పౌష్టికాహారం తిన్నారో, సమతులాహారం తీసుకున్నారో గుర్తించి మార్కులు ఇవ్వండి. అలాగే బలమైన ఆహారం తీసుకోవడంలో ప్రయోజనాల గురించి కథలు చెప్పడం, పిల్లలతో క్లాస్‌రూమ్‌లో నాటిక వేయించడం చేయిస్తుండాలి. అలా వారిలో ఆహారం విషయంలో ఆసక్తి పెరుగుతుంది. ఏ క్లాసులోనైనా సరే మంచి ఆహారపు అలవాట్ల గురించి వివరించడం ఉపాధ్యాయులు బాధ్యతగా తీసుకోవాలి. ప్రతిరోజూ పిల్లలకు ఉదాహరణలతోపాటు, పౌష్టికాహారం గురించి బోధిస్తుంటే క్రమేపీ వారికి, ఆవిధంగా పౌష్టికాహారం తీసుకుని బలం తెచ్చుకోవాలన్న ఆలోచన వస్తుంది. అదే ఆరోగ్య సూత్రాలు పాటించేట్టు చేస్తుంది. ఉపాధ్యాయులు చెబితేనే పిల్లలు వింటారన్నది ఈ విషయంలో ఎంతో పనిచేస్తుంది.





### ఫుడ్ గ్రూప్

పిల్లలకు ఆహార నియమాలు, పౌష్టికాహారం గురించి తెలియజేయడానికి మంచిరోజులు చూసుకోనవసరం లేదు. ఎంత చిన్న వయసులో చెబితే అంతమంచిది, ఆలస్యమైనా ఆందోళన పడాల్సినదేమీ లేదు. మంచి ఆహారం అంటే ఏమిటి? వాటిలో రకాలు, లాభనష్టాలు, వాటిని ఎలా తీసుకోవాలి? మొదలైనవి విద్యార్థులకు తెలియజేయాలి. సాధారణంగా పెద్ద క్లాసు పిల్లలకు మరింత వివరంగా బోధించనవసరం ఉండదు. వారికి సైన్స్ ఉపాధ్యాయులు కొంత బోధించే ఉంటారు. పిల్లలకు బోధించడానికి ఉపాధ్యాయులు మార్కెట్లో లభించే పుస్తకాలను ఆధారం చేసుకోవచ్చు. ఈ రోజుల్లో ఆహారపు అలవాట్లు, తీసుకోవాల్సిన జాగ్రత్తల గురించి అనేక పుస్తకాలు వస్తున్నాయి. ఉదాహరణలతో, వివరణాత్మకంగా ఉన్నది చదివి బోధించవచ్చు. కింద పేర్కొన్న గ్రూప్ చిత్రాన్ని పరిశీలించండి. ఏ గ్రూప్‌లో ఏవి పేర్కొన్నారు. వాటిని మనం తీసుకుంటున్నామా లేదా, వేటిలో అవి ఎంత శాతం ఉంటాయన్నది తెలుసుకోవాలి. పండ్లు, కూరగాయలు, పాలు, వెన్న, మాంసం, బీన్స్, చేప మొదలైనవి ఎంతో బలమైనవన్నది వేరే చెప్పనవసరం లేదు. అయితే పిల్లలు ఏ విధంగా తీసుకోవాలన్నది చెప్పి ఉత్సాహపరచాలి.



### అన్నీ తినాలి

ఆరోగ్యంగా ఎదగాలంటే అన్ని ఆహార పదార్థాలూ తినాలి. ఇది ఆరోగ్య మౌలిక సూత్రం. దీన్ని పిల్లలంతా పాటించి తీరాలని బోధించాలి. చాలామంది పిల్లలు అన్ని రకాలూ తినరు. కూరగాయల్లోనూ అన్నీ తినరు, సీజనల్‌గా లభించే పండ్ల జోలికి వెళ్ళేవారు చాలా అరుదు. ఇదే అనారోగ్యానికి దారితీస్తుంది. పండ్లు తినాలి అంటే యాపిల్ అని కాదు. అరటి, జామ, నారింజ, బత్తాయి కూడా తినాలి. వీలైనంతవరకూ కొవ్వు పదార్థాలను దూరంగా ఉంచండి.



## బ్రేక్‌ఫాస్ట్ మర్చిపోవద్దు

పౌష్టికాహారం గురించి బోధించేటప్పుడు పిల్లలకు వీలైనంతగా ఇతర పదార్థాలు అంటే కొద్దిగా వేపుడు పదార్థాలు, స్వీట్లు మొదలైనవి కూడా తీసుకోవచ్చని చెప్పాలి. సాధారణంగా పిల్లలు కొన్నింటిని మాత్రమే తింటారు, తినడానికి ఇష్టపడతారు. కొన్నింటిని అసలు రుచి చూడకుండానే వ్యతిరేకిస్తారు. చివరగా విద్యార్థులు ఆహారంతో పాటు, వ్యాయామం ప్రాధాన్యతను తెలుసుకోవాలని ఉపాధ్యాయులు చెప్పాలి. ప్రతిరోజూ వ్యాయామం చేయాలని చెప్పాలి. కేవలం ఆటలాడడం మాత్రమే శరీరానికి బలాన్నీ, చురుకుదనాన్నీ ఇవ్వదు.

మొత్తానికి ఉపాధ్యాయులు పిల్లల ఆహారపు అలవాట్లను, అసలు ఏ ఆహార పదార్థాలు ఎక్కువ ఇష్టపడతారో, ఎందుకు కొన్నింటిని వ్యతిరేకిస్తారో తెలుసుకోవాలి. వారి లోపాలు, భ్రమలు తొలగించి బలమైన ఆహారాన్ని తీసుకునేందుకు ఉత్సాహపరచాలి. అప్పుడే మంచి తెలివిగల, ఆరోగ్యవంతుడైన యువకులను తయారుచేయగలరు.



## ఉపాధ్యాయుల క్లబ్



క్లాస్‌రూమ్‌లో ఆహార నియమాలు పాటించడం గురించి పిల్లలకు ప్రత్యేకించి బోధించడంలో ఉపాధ్యాయులు ఎన్నో ఇబ్బందులు ఎదుర్కొంటుంటారు. అయితే అందుకు సన్నద్ధం కావడానికి పౌష్టికాహారం, దాని ప్రయోజనాలు, లోపంతో వచ్చే సమస్యలు, అనారోగ్యానికీ, చదువులో రాణించడానికీ ఉన్న సంబంధం గురించి సంపూర్ణ వివరాలు, సమాచారం ఉపాధ్యాయులు క్షుణ్ణంగా తెలుసుకోవాలి. అప్పుడే వారు పిల్లలకు కొద్ది కొద్దిగా వీలైన సమయంలోనే చెబుతుండడానికి ఆస్కారముంటుంది. ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాల్లో దీని ఆవశ్యకత ఎంతో ఉంది. అందువల్లే ఆయా ప్రాంతాల్లో ఉపాధ్యాయులు ఒక క్లబ్ ఏర్పాటు చేసుకోవాలి. ప్రభుత్వ, ప్రైవేటు పాఠశాలల ఉపాధ్యాయులు అందరూ ఆ క్లబ్‌లో పిల్లలకు పాఠాలు బోధించడంతో పాటు, ఆహారం, ఆరోగ్యం గురించిన జాగ్రత్తలనూ బోధించడంలో మార్గాలను చర్చించుకోవాలి. బయటి నుంచీ లభించే సమాచారాన్ని అందిపుచ్చుకోవాలి. ఉపాధ్యాయులకు ఈ విషయంలో పరిజ్ఞానం ఉండడం ఎంతో అవసరం. అనుభవజ్ఞులైన ఉపాధ్యాయులు విద్యార్థులకు సులభంగా బోధించగలరు. గణితం, సైన్స్ పాఠాలు చెబుతున్నట్టే ఆహారపు అలవాట్లూ, పాటించాల్సిన జాగ్రత్తలనూ బోధించాలి. మంచి విద్యార్థిని తయారుచేయడంలో ఉపాధ్యాయుల పాత్ర ఎంతోకీలకమన్నది వేరే చెప్పనవసరం లేదు. అలాగే మంచి ఆరోగ్యవంతుడైన భావిపౌరుణ్ణి తయారుచేయడంలోనూ పాత్ర వహించడం కూడా అంతే అవసరం.

# స్వయంప్రేరణ





డా. బి.వి.పట్టాభిరామ్

అమెరికాలోని మెట్‌లైఫ్ అనే సంస్థ టీచర్లపై నిర్వహించిన ఒక సర్వేలో ఆసక్తికరమైన విషయాలు బయటపడ్డాయి. 35 శాతం మంది టీచర్లకు ఉపాధ్యాయ వృత్తిలో కొనసాగాలని లేదట. వేరే ఉద్యోగం దొరక్క ఇందులో చేరారట. 21 శాతం మంది టీచరు ఉద్యోగంలో కావాలని చేరినా, యాజమాన్య వైఖరి, ఆర్థిక ఇబ్బందులు, విద్యార్థినీ విద్యార్థులను తగువిధంగా మార్చలేకపోవడం, సమాజం పోకడల వల్ల ఉద్యోగం విడిచిపెట్టి పోతున్నారు. అటువంటి వారే మళ్ళీ చేరుతున్నారు, ఉద్యోగాన్ని విడిచిపెడుతున్నారు.

10 శాతం టీచర్లు వంశపారంపర్యంగా టీచరు వృత్తిలోనే కొనసాగుతున్నారు. వారికి అదిమాత్రమే వచ్చని, నమ్మి పనిచేస్తున్నారు. మిగతావారు మాత్రమే నిజమైన అంకితభావంతో ఉపాధ్యాయ వృత్తిలో కొనసాగుతున్నారు. వీరే ఈ రంగంలో కొత్తకొత్తవి నేర్చుకోవాలనే తపన, చదువులో తాము కూడా ఎదగాలనే కోరిక ఉన్నవారని తేలింది. వీరిమీదే పిల్లల భవిష్యత్తు ఆధారపడి ఉంది.

ఈ సర్వేలో అక్షరాలా, అదే శాతం కాకపోయినా కొద్దిగా అటూ ఇటూగా ఉండవచ్చు. ఒకప్పుడు భారతదేశంలో కూడా 'బతకలేక బడిపంతులు' అని అనేవారు.



**బతకడానికే బడిపంతులు**

పూర్వం బతకలేక బడిపంతులు అనేవారు. ఇప్పుడు మాత్రం బతకడానికి బడిపంతులు రోజులు వచ్చాయి. పెద్దపెద్ద చదువులు చదివిన వారు కూడా రాష్ట్ర ప్రభుత్వం నిర్వహించే టీచరు ఉద్యోగాలకు పోటీపడుతున్నారు. బి.ఎ., బి.కామ్., బి.ఎస్సీ. చదివి బి.ఎడ్. చేసిన వారికి ఉద్దేశించిన డి.ఎస్సీ పరీక్షలను ఇంకా ఉన్నతవిద్యలు అభ్యసించిన వారు కూడా రాస్తున్నారు. ఈ మధ్య పి.హెచ్‌డి. చేసిన వ్యక్తి కూడా ఈ ఉద్యోగం చేశాడు. నిజానికి ఆయన ఒక కాలేజీలో ప్రొఫెసర్ ఉద్యోగానికి పోటీపడాలి.

ఈమధ్య ప్రభుత్వ రంగ సంస్థలో టీచరు ఉద్యోగానికి పి.హెచ్‌డి. చేసిన వ్యక్తి సెలక్ట్ అయ్యాడు. వారికిచ్చిన శిక్షణా కార్యక్రమంలో నేను 'మీరు పి.హెచ్‌డి. చేసి వచ్చారు. ఇక్కడ పిల్లలంతా చిన్న తరగతుల వారు. వీరికి మీ అవసరం ఉందా' అని అడిగాను. దానికి ఆయన 'ప్రభుత్వ ఉద్యోగానికి కనీస అర్హత డిగ్రీ అన్నారు కానీ, గరిష్ట అర్హత రాయలేదు' అని అన్నాడు. ఇటువంటి వారు ఉద్యోగంలో చేరినా, ఇంకా మంచి అవకాశమొస్తే మధ్యలో వదిలేసి వెళ్ళవచ్చు. అదే విషయం ఆయనను అడిగాను. 'మీకు ఇంతకంటే మంచి ఉద్యోగం వచ్చి మీరు వెళ్ళిపోతే మీ స్థానంలో ఈ ఉద్యోగంలో మరొకరు చేరడానికి సంవత్సరం పట్టవచ్చు లేదా రెండు సంవత్సరాలు పట్టవచ్చు,

ఈలోగా ఆ ఊరి బడి పిల్లల సంగతి ఏమిటి' అని అడిగాను, దానికి ఆయన సమాధానంగా నవ్వాడు.

మనదేశంలో ప్రభుత్వ ఉద్యోగమొస్తే రిటైర్ అయ్యేవరకు పనిచేయొచ్చు, ఎప్పుడైనా రాజీనామా చేయొచ్చు. ఉద్యోగంలో చేరిన తరువాత కనీసం 3 నుంచి 5 సంవత్సరాలు పనిచేయాలన్న నిబంధన లేకపోవడం వల్లే ఉద్యోగాల్లో జంపింగ్‌లకు ఆస్కారమేర్పడుతోంది. కొంతమంది టీచర్ ఉద్యోగాల్లో చేరినా, ఇతర పరీక్షలకు ప్రిపరేషన్ నిమిత్తం నెలల తరబడి సెలవులు పెడుతున్నారు. ఈలోగా వారికి అప్పగించిన పనిని ఎవరు చేస్తారు? ఇటీవల ఒక వార్తా కథనం ప్రకారం... మన దేశంలో దాదాపుగా మూడులక్షల మందికి పైగా టీచర్లు సంవత్సరాల తరబడి లీవులో ఉంటూ విదేశాల్లో పనిచేస్తున్నారట. అదీ అనధికారికంగా. దాదాపుగా 50 వేల మంది స్కూలు టీచర్లు అనధికారంగా న్యాయవాదులుగా పనిచేస్తున్నారు. ప్రభుత్వ జీతం రంచన్‌గా అందుతుండడమే దీనికి కారణం. వారి బడిలోని ఇతర టీచర్లు నిజాయితీగా బడికెళ్తూ, పనిదొంగల్ని కాపాడుతూ ఉద్యోగం చేస్తున్నారు. ఇటువంటి వారి సంఖ్య మన రాష్ట్రంలో కొద్దోగొప్పో ఉంది. అయితే మీడియా భయంతో కొందరు జాగ్రత్త పడుతున్నారు.




### కింకర్తవ్యం

మెట్‌కేఫ్ సంస్థవారి నివేదికలోనూ దాదాపు ఇటువంటి సమాచారమే ఉంది. చివరిగా వారు సమాజానికి చేసిన విన్నపం ఒక్కటే. 'మీరు ఏ ఉద్యోగానికి అయినా దరఖాస్తు చేయండి. ఉద్యోగంలో చేరండి. నచ్చకపోతే మరో ఉద్యోగం, అదీ నచ్చకపోతే మరో ఉద్యోగం చేయండి. కానీ టీచరు ఉద్యోగానికి దరఖాస్తు చేసేవారు దయచేసి ఇది ఒక మెట్టులా, ఒక తెప్పలా వాడకండి' అని.

మీరు మధ్యలో వదిలేస్తే, ఆ ఖాళీ పూరించడానికి జిల్లా యంత్రాంగానికి చాలా తతంగం ఉంటుంది. ప్రయివేటు రంగంలో అయితే మరునాడు మరొకరిని నియమిస్తారు. ప్రభుత్వానికి అది జరిగే పని కాదు.

ఉపాధ్యాయులు తమ వృత్తిపట్ల ఎటువంటి వైఖరితో ఉన్నారో తెలుసుకోవడానికి అనేక రకాల ప్రశ్నాపత్రాలున్నాయి. జాబ్ శాటిస్‌ఫ్యాక్షన్ స్కేలు ఉన్నప్పటికీ, ఎవరికివారు, ఎప్పటికప్పుడు చేసుకోవాల్సిన ఒక పరీక్ష ఉంది. మార్కులు తక్కువగా వస్తే ప్రేరేపించుకుంటూ, ఉపాధ్యాయ వృత్తిలో ఆసక్తిని పెంపొందించుకుంటూ ఉండాలి.





నాకు ఉద్యోగం బాగుంది కానీ, ఇంటికి చాలా దూరంగా ఉంది..................

ఉద్యోగంలో నాకు తగిన స్థానం లభించలేదు.

సాటి ఉద్యోగుల ప్రవర్తన నచ్చడం లేదు.

హెడ్మాస్టరుకు, ఇతర సీనియర్లకు అహంకారం ఉంది.

నా చదువుకు ఈ ఉద్యోగం తగినది కాదు.

ఈ ఉద్యోగంలో ప్రమోషన్ల పద్ధతి బాగాలేదు.

మా పాఠశాలలో తగినంత ప్రేరణ లేదు.

పాఠశాలలో టీచర్ల మధ్య తగిన స్నేహం లేదు.

ఈ ఉద్యోగంలో ఎక్కువ కాలం ఉండలేను.

రాజకీయ నాయకుల ఒత్తిడి తట్టుకోలేకపోతున్నాను.

ఇక్కడ తగిన మర్యాద, గుర్తింపు లభించడం లేదు.

ఉద్యోగంలో అసమర్థులను అందలం ఎక్కిస్తున్నారు.

ఎదుటివారిని పొగిడే వారికే ఇక్కడ స్థానం ఉంటుంది.

ఇక్కడ నేను చెప్పేంత నిజాయితీగా ఇతరులు పాఠం చెప్పడం లేదు.

ఇంతకన్నా మంచి ఉద్యోగం కోసం ప్రయత్నిస్తున్నాను.

ఇతర మనుషుల్లో కులం, జాతి పిచ్చి ఎక్కువగా ఉంది.

నా బాధలు పంచుకునే కొలీగ్ ఇంతవరకు లభించలేదు.

ఈ ఉద్యోగంలో ఉంటే నాకు పిచ్చెక్కేలా ఉంది.

మా బడిలో చదువుకన్నా మార్కులు ఎక్కువ.

ఇప్పుడు మీ సమాధానం ఎ అయితే ఒక మార్కు, బి అయితే ఐదు మార్కులు, సి అయితే మూడు మార్కులు, డి అయితే నాలుగు మార్కులు వేసుకోవాలి.

మీ స్కోరు ఫలితాలు ఇవిగో...

20 – 40 మధ్య మార్కులొస్తే మీకు ప్రేరణ చాలా అవసరం.

41 – 60 మధ్య మార్కులొస్తే మీరు నిరంతరం స్వయం ప్రేరణ చేసుకోవాలి, సర్దుకుపోవడం నేర్చుకోవాలి.

61 – 80 మధ్య మార్కులొస్తే మీకు ప్రేరణ తగినంతగా ఉంది.

81 –100 మధ్య మార్కులొస్తే మీరు ఉత్తమ టీచర్లు.

విద్యాభ్యాసంలో అన్నింటికంటే ప్రధానమైనది ఏమిటి? దీనికి అనేక రకాల జవాబులు వస్తాయి. పాఠశాల అని.. ఉపాధ్యాయుడు అని... పాఠ్యప్రణాళికలు అని... పాఠ్యపుస్తకాలనీ...బోధనా ఉపకరణాలని సమాధానాలు వినిపిస్తాయి. ఇవన్నీ కూడా వాస్తవాలేకానీ, వీటిని మించిన అంశం ఒకటి అంతర్లీనంగా బోధనాప్రక్రియను ప్రభావితం చేస్తుంటుంది. నిజానికి దీనిపై ఆధారపడే బోధనాప్రక్రియ ఫలితాలు వెలువడతాయి. అదే ఉపాధ్యాయుడు, విద్యార్థికి మధ్య ఉండే మానసిక బంధం. ఈ బంధం ఏర్పడే స్థాయిని బట్టే విద్యాభ్యాస స్థాయి ఉంటుంది.

తరగతి గదిలో ఉపాధ్యాయుడు, విద్యార్థుల మధ్య ఒక మానసిక పరమైన అడ్డుతెర ఏర్పడటం సహజం. ఇందుకు రెండు కారణాలున్నాయి. తాను ఉపాధ్యాయుడిని అనే భావనలో పాతుకుపోయి ఉండటం, అందువల్ల ఉపాధ్యాయుని యొక్క హావభావాలు, సంభాషణలు ఆదేశాల్లో ఈ అధిక్య భావన ప్రతినిమిషం ద్యోతకం అవుతుంటుంది. అదే విధంగా ఉపాధ్యాయుడు తమకంటే విజ్ఞానం రీత్యా ఉన్నతుడని తాము ఆయన వద్దే నేర్చుకోవడానికి వచ్చామని విద్యార్థులు భావిస్తూ, మానసికంగా అల్పత్వ భావనలో ఉంటారు. దీనితో సహజంగానే ఇద్దరి మధ్య అంతరం ఏర్పడి ఉంటుంది. దీనికితోడు తరగతి గదిలో విద్యార్థి మానసిక పరిస్థితి... పాఠం అర్థం కాకపోతే, విద్యార్థి వెంటనే లేచి ఆ విషయం ఉపాధ్యాయునికి చెప్పలేడు. ఉపాధ్యాయుడు ఏమైనా అనుకుంటాడేమోనని లేదా తనను అవమానిస్తాడేమోనని భయపడతాడు. అలాగే పాఠం తనకు మాత్రమే అర్థం కాలేదేమోనని, మిగతా విద్యార్థులకు అర్థమై ఉంటుందని భావించడం వల్ల కూడా వెంటనే అడగలేడు. తనకు పాఠం అర్థం కావడంలేదని అడగడం ద్వారా తోటివిద్యార్థుల ముందు నవ్వులపావులతానేమోనని భయపడతాడు. దీనితో ఉపాధ్యాయునితో స్వేచ్ఛగా వ్యవహరించలేరు. ఇది ఒక మానసిక అవరోధంగా మారి, అడ్డుతెరగా ఏర్పడుతుంది. తరగతి గదిలో ఇది కేవలం ఒక విద్యార్థికి సంబంధించిన సమస్య మాత్రమే కాదు. దాదాపు అందరు విద్యార్థులు ఎదుర్కొనే సమస్యే. ఇదే సమయంలో ఉపాధ్యాయునివైపు నుంచి ఈగో(అహం) సమస్యలు కూడా ఉత్పన్నం అవుతున్నాయి.

- ఉపాధ్యాయుడు ఉద్యోగరీత్యా తానే సర్వోత్తముడని భావించవచ్చు. లేదా ఉపాధ్యాయుడు తాను బోధిస్తున్న తీరుపట్ల పూర్తి సంతృప్తి లేకపోవచ్చు.
- తనకంటే విషయజ్ఞానంలో కొందరు విద్యార్థులు ముందున్నారని గుర్తించి ఉండవచ్చు.

ఈ కారణాల రీత్యా ఉపాధ్యాయుడు విద్యార్థులతో స్వేచ్ఛగా మసలలేడు.దీనికితోడు కొందరు విద్యార్థులు తరగతి గదిలో పాఠం ముగిసిన అనంతరం, సందేహాలు వ్యక్తంచేస్తుంటే అసహనం ప్రదర్శిస్తాడు. ఆ తరహా విద్యార్థులను తిరస్కార భావనతో చూస్తాడు. మొత్తం మీద ఉపాధ్యాయుడు, విద్యార్థుల మధ్య వివిధ కారణాల రీత్యా అంతరం ఏర్పడుతుంది. ఇదివారి మధ్య మానసిక అవరోధ తెరను ఏర్పరుస్తాయి. దీని వల్ల బోధన కేవలం ఉపన్యాస విధానంలో ఏకపక్షంగా సాగుతుంది. ఇలాంటి కోవకు చెందిన వారు కేవలం పదిశాతం మాత్రమేనన్న విషయం మరవరాదు. విద్యాభ్యాసం నూటికి నూరుశాతం సంపూర్ణంగా జరగాలంటే ఉపాధ్యాయుడికి, విద్యార్థులకు మధ్య ఏర్పడిన మానసికమైన అడ్డుతెరను ఛేదించకతప్పదు. ఇందుకు ఉపాధ్యాయుడే పూనుకోవాలి. అందుకు కొన్ని మార్గాలను ఎంచుకోవచ్చు,

**విశ్వాసం:**

ఉపాధ్యాయుడు తొలుత విద్యార్థుల విశ్వాసం పొందే ప్రయత్నం చేయాలి. తరగతి గదికంటే బయటే ఈ అవకాశం లభిస్తుంది. గతంలో గ్రామాల్లో ఉపాధ్యాయుడు విద్యార్థుల మధ్య సాన్నిహిత్యం ఉండేది. అందువల్లనే విద్యార్థి, ఉపాధ్యాయునికి మధ్య సన్నిహితంగా మెలిగేవాడు. అలాగే ప్రస్తుత వాతావరణంలోనూ ఉపాధ్యాయుడు విద్యార్థులతో పాఠశాల బయటకూడా మంచి సంబంధాల కోసం ప్రయత్నం చేయాలి. అన్ని సంకోచాలను వదిలి విద్యార్థులతో మనసు విప్పి మాట్లాడాలి. దీని వల్ల విద్యార్థుల్లో ఉపాధ్యాయుని పట్ల భయం పోతుంది. విద్యార్థుల కుటుంబనేపథ్యం గురించి ఉపాధ్యాయుడు తెలుసుకోవాలి. దీనివల్ల విద్యార్థి ఏదైనా సబ్జెక్టుల్లో వెనకబడుతుంటే, దానికి కారణాలు అవగతం అవుతాయి. ఇలా ఉపాధ్యాయుడు విద్యార్థికి సన్నిహితంగా మెలగడం వల్ల అతనికి ఉపాధ్యాయునిపై విశ్వాసం ఏర్పడుతుంది. ఉపాధ్యాయుడు తన శ్రేయోభిలాషిగా విద్యార్థి భావిస్తాడు.

**చుక్కా రామయ్య " మంచి టీచర్ ఎలా ఉండాలి" నుంచి**

జీవితంలో అన్ని వృత్తుల్లో వలె ఉపాధ్యాయ వృత్తిలోనూ మంచి సెన్స్ ఆఫ్ హ్యూమర్ ఉండాలి. అదే సాధారణ ఉపాధ్యాయుడిని ఎంతో మంది ఆదరించే మంచి ఉపాధ్యాయునిగా మారుస్తుంది. వయసుతో నిమిత్తం లేకుండా విద్యార్థులతో సన్నిహిత సంబంధాలు ఏర్పరుస్తుంది. అంటే మీరు కమెడియన్‌లా ఉండనవసరంలేదు, కానీ తరగతిలో కాస్తంత హాస్య చతురోక్తులతో పాఠాన్ని మరింత ఆసక్తికరంగా చెప్పవచ్చు. విద్యార్థులకు హుషారుగా ఉంటుంది. పాఠం శ్రద్ధగా వింటారు. అయితే హాస్యచతురత చాలా సహజంగా ఉండాలేగాని తెచ్చిపెట్టుకున్నట్టుగా ఉండకూడదు.



**ఉపాధ్యాయునిగా ఉండాలని కోరుకోవాలి**

మంచి ఉపాధ్యాయుడు ఎప్పుడు ఆ స్థాయిలోనే ఉండాలని కోరుకుంటాడు. కొందరు కాలేజి విద్య తర్వాత తాము ఆశించని ఉద్యోగాలు లభించనపుడు ఉపాధ్యాయ వృత్తి చేపడుతుంటారు. వారు బోధనలో ఆనందాన్ని ఇంకా చవిచూడలేదనే భావించుకుంటూంటారు, మరికొందరు తమకు విద్యార్థులు లేదా క్లాస్‌రూమ్ ప్రత్యేకించి ఇష్టపడటం లేదని పేర్కొంటూంటారు. అయితే, అలాంటివారు చేసేదేమీ లేక అలా ఉపాధ్యాయ వృత్తిలోనే ఉండిపోతారు. దీనవల్ల విద్యార్థులకుఅంతగా స్ఫూర్తినివ్వని ఉపాధ్యాయులు ఉంటున్నారు. మంచి ఉపాధ్యాయులకు తరగతి గదిపై అభిమానం ఉండాలి, కనీసం మంచి అనుకూల భావనైనాకలిగి ఉండాలి.

**ఇష్టం ఉండాలి**

ఉపాధ్యాయులకు ముఖ్యంగా ఉండాల్సినది తమ సబ్జెక్టు పట్ల వీరాభిమానం. సబ్జెక్టు మెటీరియల్‌పట్ల నిర్లక్ష్యంగా ఉంటే, ఇక విద్యార్థులకు ఆసక్తి ఎందుకు ఉంటుంది? సబ్జెక్టుపట్ల ఇష్టం ఉండాలి, ముఖ్యంగా విద్యార్థులకు మరింత అభిమానం ఉండాలి. అప్పుడే ఉపాధ్యాయుడు తన శక్తినంతా ధారపోసి తరగతిలో ఆసక్తికరంగా పాఠం చెప్పగల్గుతాడు. తద్వారా విద్యార్థుల్లోనూ సబ్జెక్టు పట్ల ఆసక్తి ద్విగుణీకృతమవుతుంది. సబ్జెక్టు మెటీరియల్ పట్ల అంతగా ఆసక్తి లేకున్నా, తరగతిలో విద్యార్థులకు ఎం తో ఉత్సాహ కలిగించేట్టు బోధించే మార్గాన్ని అనుసరించాలి.

**పాలుపంచుకోనీయండి**

మంచి ఉపాధ్యాయుడు విద్యార్థులనుకూడా బోధనా క్రమంలో పాలుపంచుకునేట్టు చేయగల్గుతాడు. అంటే డిబేట్లు, చర్చలు నిర్వహించి పాఠ్యాంశంపట్ల ఆసక్తి రెండింతలు జేస్తాడు. బోధించడంలో ఉపన్యాసం వల్ల నష్టమేమీ ఉండదు,మంచి సమాచారాన్ని విద్యార్థులకు అందుతుంది. సబ్జెక్టు గురించి విద్యార్థులకు అంతగా తెలియనప్పుడు, ఉపాధ్యాయులు ఏదో విధంగా సబ్జెక్టును ప్రారంభించాలి. ఇప్పటికీ ఉపాధ్యాయులు విద్యార్థులను చిన్న చిన్న గ్రూప్‌గా విభజించి లేదా సోక్రటీస్ విధానంలోనైనా వారితో చర్చించడానికి, మాట్లాడటానికి ప్రయత్నాలు చేస్తూనే ఉంటారు. అంటే కేవలం సమాచారాన్ని వినడమే కాకుండా దాన్ని ఇచ్చిపుచ్చుకోవడం ద్వారా మరింత నేర్చుకోను ఉపాధ్యాయులు ఆ విధంగా వీలుకల్పిస్తారు. ఎంతో బాగా బోధించడమన్నది ఉపాధ్యాయులకు సహజంగా రావాలి. అది కొందరికి



ప్రాక్టీస్ ద్వారా వస్తుంది. బోధనా విధానాలు, సిద్ధాంతాలను బోధించవచ్చు కానీ ఉత్తమ ఉపాధ్యాయులకు బోధనా నైపుణ్యం ఎంతో సహజంగా అదో కళగానూ ఉంటుంది. అందుకే మంచి ఉపాధ్యాయులు తమ అనుభవం, విద్యార్హతలకు మించి విద్యార్థుల అభ్యసనా సామర్థ్యాన్ని పెంచేందుకు శాయశక్తులా కృషి చేస్తుంటారు.

**మనసుపెడతారు**

ప్రతి పిల్లవాడికి మంచి ఉపాధ్యాయుడు కావాలి. మంచి ఉపాధ్యాయుడు పిల్లలకు ఏం కావాలి, వారు దేనిపై శ్రద్ధ చూపుతుంటారు. అంతేకాదు బోధనలో భాగంగా అభ్యసించడానికి వెనుకాడరు, తక్కువగానూ భావించరు.

**ధర్మబద్ధంగా ఉంటారు**

ఉత్తమ ఉపాధ్యాయులు ధర్మబద్ధంగా ఉంటారు. ఎవరిపట్లా, దేనిపట్లా ఆకర్షితులు కారు. విద్యార్థులందరి పట్లా నిష్పక్షపాతంగా వ్యవహరిస్తారు. తరగతిలో విద్యార్థులు ఎలా నడచుకోవాలో కఠినంగా పేర్కొంటారు. అంతేగాక వాటని ఆచరించి మార్గదర్శకంగా నిలుస్తారు. మంచి విద్యార్థిని ఎంతగా అభిమానిస్తారు, చెడుగా ప్రవర్తిస్తే అంతే కఠినంగా శిక్షిస్తారు.

**వాస్తవానికి దగ్గరగా ఉంటారు**

ఉత్తమ ఉపాధ్యాయులు తరగతిలోని విద్యార్థుల వయసుతో నిమిత్తం గాకుండా వారి విద్యాభ్యాసస్థాయికే ఎక్కువ ప్రాధాన్యతనిస్తారు. అందరూ తాను చెప్పే మార్గంలో వేగంగా నేర్చుకోవాలన్న పట్టుదలతో ఉంటారు. ఉపాధ్యాయులు లేనప్పుడు విద్యార్థుల గోలకి అంతుండదు. కానీ ఆలా ప్రతి విద్యార్థి అల్లరి చేయదన్నది అర్థంచేసుకుంటారు. చాలా సందర్భాల్లో తన తరగతి గదిలోనూ ఆ వాతావరణానికి ఆస్కారం ఉంటుంది. అల్లరిని నియంత్రించడానికి వెంటనే కాస్తంత కఠినంగా వ్యవహరిస్తారు.

**ఎంతో నేర్చుకుంటారు**

ఉపాధ్యాయులందరికీ అన్నీ తెలియాలని నిబంధన లేదు, ముఖ్యంగా సైన్స్ సబ్జెక్టు విషయంలో. ఇవాళ గొప్పదనుకున్నది మర్నాడు మారిపోవచ్చు. ఇవాళ చెప్పలేనిది మర్నాడు ఎంతో బాగా చెప్పవచ్చు. తాజా సమాచారం అందించాలన్న తపన మంచి ఉపాధ్యాయులకు ఎప్పుడూ ఉంటుంది. అదే ధ్యాసలో ఉంటారు. విద్యార్థుల నుంచి ప్రశ్నలను ఆహ్వానిస్తుంటారు.

**నీతిమంతులు**

నీతి అనేది కేవలం ఫిలాసఫీ బోధించేవారికి మాత్రమే చెందినది కాదు. ఉత్తమ విద్యార్థులకు అది జీవన మార్గం. విద్యార్థులను సన్మార్గంలో పెట్టడానికి అనుసరించే పద్ధతి. తరగతికి బోధనా సామగ్రి ఎంపికలో ఆ విధానాన్నే పాటిస్తుంటారు. అలాగే విద్యాసంస్థ అధికారులతో పలు విషయాల సంప్రదింపులు, చర్చల్లోనూ అదే పంథాను అనుసరిస్తుంటారు.

**సమాజంలో నాయకుడు**

ఉత్తమ ఉపాధ్యాయుడు చుట్టుపక్కల ఉంటే ఆ ప్రాంతం, ఆ సమాజం ఎంతో అదృష్టం చేసుకుందనే అనాలి. ఉత్తమ ఉపాధ్యాయులకు తరగతిలో పాఠం చెప్పడం ఒక్కటే తమ పనిగా భావించరు. రోజువారీ జీవనంలో ఇతరులతోనూ పాలుపంచుకుంటుంటారు. తమ పరిసరాల బాగోగులకు అధిక ప్రాధాన్యతనిస్తూంటారు.

**హుందాగా ఉంటారు**

ఉత్తమ ఉపాధ్యాయులు ఇతరులకు మార్గదర్శకంగా ఉండటంలో ఎంతో పరిశుభ్రత పాటిస్తుంటారు. విద్యార్థులతో కలిసిమెలిసి ఉంటున్నప్పటికీ, సరదాగా ఉండాలనుకున్నప్పటికీ తన హుందాతనాన్నిమాత్రం వదులుకోరు. అన్ని వర్గాల నుంచి ఆదరాభిమానాలను పొందుతూంటారు.

# చదువు కోసం తపన పడుతున్న సంస్థలు....

దేశంలోని బడి వయస్సు చిన్నారులకు నాణ్యమైన విద్యనందించే కృతువులో అనేక ప్రభుత్వేతర స్వచ్ఛంద సంస్థలు పనిచేస్తున్నాయి. ఎన్నో వినూత్న కార్యక్రమాల ద్వారా సంప్రదాయంగా చదువుకు దూరంగా ఉండే అనేక వర్గాలకు చెందిన పిల్లలను విద్యాస్రవంతిలోకి తీసుకొచ్చేందుకు ప్రయత్నిస్తున్నాయి. అటువంటి సంస్థల్లో కొన్ని ముఖ్యమైన వాటిని చూద్దాం.

భారతీయ, బంగ్లాదేశ్ జంటకు జన్మించి, అమెరికాలో స్థిరపడి, ప్రపంచ ప్రఖ్యాత ఎంఐటి, హార్వర్డ్ విశ్వవిద్యాలయాల్లో విద్య అభ్యసించిన సల్మాన్‌ఖాన్, ఈ ఖాన్ అకాడమీని 2006లో ప్రారంభించారు. ఖాన్ ప్రాథమిక విద్యావ్యాప్తికి వెబ్, ఆడియో, వీడియో మాధ్యమాలను ఎంచుకున్నారు. ప్రాథమిక తరగతుల్లోని విద్యార్థులకు ఎంతో సులభతరంగా అర్ధమయ్యే రీతిలో ఆయన అనేక వీడియోల రూపకల్పన చేశారు. గణితం, చరిత్ర, ఆరోగ్య సంరక్షణ, వైద్యం, ఫైనాన్స్, భౌతికశాస్త్రం, రసాయన శాస్త్రం, జీవశాస్త్రం, ఖగోళశాస్త్రం, అర్థశాస్త్రం, కాస్మాలజీ, కర్బన రసాయన శాస్త్రం, కంప్యూటర్ సైన్సెస్ ఇలా పలు సబ్జెక్టులకు సంబంధించి 3,600 వీడియోలను యూట్యూబ్ ద్వారా అప్‌లోగ్ చేశారు.

మసాచుసెట్స్ విశ్వవిద్యాలయం నుంచి గణితం, ఎలక్ట్రికల్ ఇంజినీరింగ్, కంప్యూటర్ సైన్సెస్‌లలో డిగ్రీలను, ఎలక్ట్రికల్, కంప్యూటర్ సైన్సెస్‌లలో ఎంఎస్ డిగ్రీలను, హార్వర్డ్ బిజినెస్ స్కూలు నుంచి ఎంబిఎ డిగ్రీలను సంపాదించిన ఖాన్, 2004లో తన సోదరి, స్నేహితులకు, మిత్రులకు గణితానికి సంబంధించిన సందేహాలను తీరుస్తుండేవాడు. ఈ ట్యూటోరియల్స్‌ను యూట్యూబ్‌లో ఉంచడం ద్వారా మరింత మందికి లాభదాయకంగా ఉంటుందనే ఉద్దేశంతో ఖాన్ వాటిని అప్‌లోడ్ చేశాడు. దీనికి అనూహ్య స్పందన రావడంతో ఖాన్, చివరికి 2009లో తన ఉద్యోగాన్ని సైతం విడిచిపెట్టి, పూర్తిస్థాయిలో ఖాన్ అకాడమీ కార్యకలాపాలపై దృష్టి సారించడం మొదలుపెట్టాడు. ఖాన్‌కు ఇప్పుడు ఎంతోమంది దిగ్గజాల్లాంటి నిపుణులు, మిత్రులు పూర్తిస్థాయి సహకారాన్ని అందిస్తున్నారు. తొలిదశలో

KHAN
ACADEMY



మిత్రుల ఆర్థిక సాయం, విరాళాల ద్వారా ఈ కార్యక్రమాన్ని ముందుకు తీసుకెళ్ళేందుకు ప్రయత్నించారు. ఇప్పుడు బిల్ అండ్ మిలిండా గేట్స్ ఫౌండేషన్ ఆర్థిక సాయం అందిస్తోంది. ఇంగ్లిష్ మాధ్యమంలో ఉన్న ఈ వీడియోలు విశ్వవ్యాప్తం చేసేందుకు మిగిలిన భాషల్లోనూ తర్జుమా చేయాలని గూగుల్, ఖాన్ అకాడమీని అభ్యర్థించింది. మరిన్ని కోర్సులు నిర్మాణం కోసం, అదేవిధంగా ప్రపంచంలోని ప్రముఖ భాషల్లోకి తర్జుమా చేసేందుకు రెండు మిలియన్ డాలర్ల విరాళం ప్రకటించింది. యూ ట్యూబ్ ఛానల్ ద్వారా ఇప్పటి వరకు 20 కోట్ల సార్లు ఈ వీడియోలు చూడబడ్డాయి. అదేవిధంగా నాలుగున్నర లక్షల మంది విద్యార్థులు ఈ వెబ్‌సైట్‌లో సభ్యులుగా ఉండి, తమ సందేహాలను తీర్చుకుంటున్నారు. ఈ సంవత్సరాంతం నాటికి 21 భాషల్లోకి తర్జుమా చేసిన వీడియోలను అప్‌లోడ్ చేయనున్నారు.

ప్రస్తుతానికి అజీం ప్రేమ్‌జీ యూనివర్సిటీ వారి టీచర్ ఆఫ్ ఇండియా బృందం ప్రాథమిక స్థాయికి చెందిన కొన్ని గణిత వీడియోలను హిందీ, తమిళం, కన్నడం భాషల్లోకి అనువదిస్తోంది. రాబోయో రోజుల్లో ఈ వీడియోలను తెలుగులోకి అనువదించే అవకాశముంది.

ఎలాంటి రుసుమూ చెల్లించకుండానే విద్యార్థులు, http://www.khanacademy.org ఉపాధ్యాయుడు ద్వారా ఈ వనరులను వినియోగించుకోవచ్చు.



తరగతి గది సమస్యలకు ఆచరణాత్మక పరిష్కారాలను కనుగొనేందుకు జోడ్‌గ్యాన్ సంస్థ పనిచేస్తోంది. 1998లో ప్రారంభమైన ఈ సంస్థ గణిత, విజ్ఞాన శాస్త్రాలను సృజనాత్మక పద్ధతుల ద్వారా పరిచయం చేసే దిశగా పనిచేస్తోంది. ఇన్ సర్వీస్ టీచర్లకు, ట్రైనీ టీచర్లకు వర్క్‌షాపుల నిర్వహణ, కృత్యాధారిత విద్యను ప్రోత్సహించేందుకు దోహదపడే తక్కువ ధర కలిగిన బోధనాభ్యసన సామగ్రిని రూపొందిస్తోంది. దీంతోపాటు గణిత, విజ్ఞానశాస్త్రాలకు ప్రజాకర్షణ కలిగించేందుకు మ్యాథ్స్ ల్యాబ్‌లను, సైన్సు డిస్కవరీ రూమ్‌లను డిజైన్ చేసింది. దీంతోపాటు సంప్రదాయబద్ధంగా విద్యకు దూరంగా ఉండే కుటుంబాలకు చెందిన పిల్లల కోసం ఢిల్లీలో పూర్వ ప్రాథమిక, ప్రాథమిక పాఠశాలలను నిర్వహిస్తోంది. ప్రస్తుతం గణితశాస్త్రాన్ని సృజనాత్మకంగా బోధించడానికి దోహదపడే కరిక్యులం రూపకల్పనలో నిమగ్నమై ఉంది. గణిత, విజ్ఞాన శాస్త్రాలకు సంబంధించిన వనరులు, వర్క్‌షాప్ వివరాల కోసం సంస్థను దిగువ చిరునామాలో సంప్రదించవచ్చు.

Jodo Gyan
E–12, Shakurpur, Near Britania Chowk, Delhi –110034. Contact:- 27100104, 9873084472





మన తాగే నీటి వనరులకు సంబంధించి పాఠశాల స్థాయి నుంచి వివిధ దశల్లో అవగాహన కల్పించేందుకు స్కూల్స్ వాటర్ పోర్టల్ పనిచేస్తుంది. శ్రీమతి రోహిణీ నీలేకర్ స్థాపించిన 'అర్ఘ్యం' అనే స్వచ్ఛంద సంస్థ దీన్ని నిర్వహిస్తోంది.

ఈ పోర్టల్‌లో ఉపాధ్యాయులు, విద్యార్థుల కోసం రంగురంగుల ప్రజంటేషన్లు, ప్లేలు, డిబేట్ టాపిక్‌లు, క్విజ్‌లు, పద్యాల వంటివి ఉంటాయి. పాఠశాల స్థాయిలో నీటి వనరులను పొదుపు చేయడానికి దోహదపడే పలు కార్యక్రమాలను ఈ పోర్టల్ స్కూలు యాజమాన్యాలకు తెలియజేస్తుంది. నీటి ప్రాధాన్యతను తెలియజేసే తెలుగు సాహిత్యాన్ని కూడా ఈ వెబ్‌సైట్‌లో పొందుపరిచారు. ఎలాంటి రుసుమూ చెల్లించకుండానే ఉపాధ్యాయులు వీటిని ఉపయోగించుకోవచ్చు.

స్కూల్స్ వాటర్ పోర్టల్ వెబ్ చిరునామా : http://www.schools.indiawaterportal.org

# అభివృద్ధిని కుంటుపరుస్తున్న

# వ్యత్యాసం



**సామాజిక సమానత్వలోపం ప్రభావం పిల్లల చదువు మీద ఎంతో పడుతోంది. చదువునేర్చుకునే అవకాశాలను అందిపుచ్చుకోవడంలో ఈ అంతర్యం పట్టణ, గ్రామీణ విద్యార్థుల విషయంలో స్పష్టమవుతోంది. దీనికి సంబంధించి ఆ మధ్య యునెస్కో ఒక నివేదిక రూపొందించింది. మన దేశంలో కేవలం 27శాతం గ్రామీణ పాఠశాలల్లో విద్యుత్ సౌక ర్యం ఉంది. అదే పట్టణాల్లో, నగరాల్లో 76శాతం పాఠశాలలకు విద్యుత్ సౌకర్యం ఉంది. అలాగే గ్రామీణప్రాంతాల్లోని పాఠశాలల్లో సగంపై అసలు బాలికలకు మరుగుదొడ్లు లేవు, నాలుగు శాతం పాఠశాలలకు టెలిఫోన్ సౌకర్యం ఉందిట. గ్రామీణ విద్యార్థుల పరిస్థితి తెలుసుకోను ఈ వాస్తవాలు చాలునేమో!**



'ఏ వ్యూ ఇన్‌సైడ్ ప్రైమరీ స్కూల్స్' పేర రూపొందించిన నివేదికలో అసలు ప్రాథమిక పాఠశాలల విషయంలో నగరాలకు, పట్టణాలకు ఉన్న వ్యత్యాసం తేటతెల్లమయింది. లాటిన్ అమెరికా, ఆసియా, ఉత్తర ఆఫ్రికాల్లోని 11 దేశాల్లో ఈ సర్వే నిర్వహించింది. అర్జెంటీనా, బ్రెజిల్, చిలి, భారత్, మలేషియా, పెరుగ్వే, పెరు, ఫిలిప్పైన్స్, శ్రీలంక, టునీషియా, ఉరుగ్వేలలో 7,600 పైగా పాఠశాలల్లో పరిస్థితులపై యునెస్కో సర్వే చేసింది. ప్రపంచదేశాల్లో విద్యారంగంలో సూచికల కార్యక్రమంలో భాగంగా పాఠశాలల్లో నాణ్యత, సమానత్వం అంశాలపై సర్వే చేపట్టింది. సర్వే చేపట్టిన పాఠ శాలల్లో నాలుగవతరగతి ఉపాధ్యాయులకు ప్రశ్నాపత్రాలను ఇచ్చారు. అసలు పాఠశాలలు ఎలా పనిచేస్తున్నాయి, ఉపాధ్యాయులు ఎలా పాఠాలు చెబుతున్నారు, చదువునేర్చుకోవడానికి పరిస్థితులు, ఉపాధ్యాయులకు ప్రిన్సిపాల్స్‌కూ అందుతున్న మద్దతు మొదలైన అంశాలపై ప్రశ్నావళి రూపొందించారు.





ఈ సర్వేలో వాస్తవపరిస్థితుల గురించిన ఎంతో మంచి సమాచారం లభించింది. చాలా పాఠశాలల్లో మంచినీరు, విద్యుత్, మరుగుదొడ్లువంటి మౌలికసదుపాయాల లోటే స్పష్టమైంది. అంతేగాక చదువునేర్చు కోవడానికి సామాజిక అసమానత ఎంతగా అడ్డుపడుతోందనేది ఈ సమాచారం స్పష్టం చేసింది. పెరూలోని గ్రామీణ ప్రాథమిక పాఠశాలల్లో చాలా తక్కువ పాఠశాలలకే విద్యుత్, మరుగుదొడ్ల సౌకర్యాలున్నాయి. పట్టణ ప్రాంతాల్లో 65శాతం పాఠశాలల్లో ఆ వసతులు, 75శాతం పాఠశాలల్లో లైబ్రరీలు ఉన్నాయి. ఎందుకీ వ్యత్యాసం? మొత్తంమీద గ్రామీణ ప్రాం తాల్లోని పాఠశాలల్లోనే ఎంతో మార్పు రావాల్సి ఉంది. బ్రెజిల్, ఫిలిప్పైన్స్‌ల్లో ఈ వ్యత్యాసం మరింతగా ఉందని సర్వే పేర్కొంది. అలాగే ఆర్థికంగా పాఠశాలలకు తల్లిదండ్రుల నుంచీ అందుతున్న మద్దతు విషయంలోనూ ఎంతో తేడా ఉంటోంది. టునీషియాలో 1/3వంతు విద్యార్థుల తల్లిదండ్రులు పాఠ్యపుస్తకాలు కొనాల్సి వస్తుంది. భారత్‌లో సుమారు 10 శాతం మాత్రమే పుస్తకాలకు చెల్లిస్తున్నారట. శ్రీలంకలో మాత్రమే విద్యార్థులందరికి ఉచితంగా పుస్తకాలు పంపిణీ చేస్తున్నారు.

నిజానికి ఈ పరిస్థితులే విద్యార్థుల జీవనవిధానాన్ని తెలియజేస్తున్నాయని సర్వేలో పాల్గన్న యోన్వాంగ్ ఝూంగ్ అభిప్రాయపడ్డారు. పాఠశాలల్లో మౌలిక సదుపాయాలకల్పనలో వ్యత్యాసం సామాజిక స్థాయికి ముడిపడిందని ఫలితంగా పిల్లలు బడిలో, ఇంటివద్దా ఎన్నో సమస్యలకు గురవుతున్నారని అన్నారు.

కుటుంబ ఆదాయం, తల్లిదండ్రుల విద్యాస్థాయి ఆధారంగా పిల్లల నేపథ్యాన్ని వివరించాలని సర్వేలో ఉపాధ్యాయులను, ప్రిన్సిపాల్స్‌ను కోరారు. ఎందరు ఏ విధంగా పౌష్టికాహారానికి దూరమవుతున్నారన్నది కనుగొన డమే దాని ఆంతర్యం. ఆవిధంగా లభించిన సమాచారం పిల్లల సామాజిక ఆర్థిక స్థాయి, పాఠశాల పరిస్థితులు, చదువుకునే వాతావరణం మొదలైన అంశాల్లో స్పష్టతకు సూచికయింది. చదువునేర్చుకోవడానికి తగిన వాతావరణ కల్పనలో కీలకాంశం ఉపాధ్యాయులను, విద్యార్థులను బడికి వచ్చేట్టు చేయడమే. సమాజంలో అణగారినవర్గాలకు చెందిన పిల్లలు బడిలో నడత సక్రమంగా ఉండటం లేదని, సమస్యాత్మకంగా వున్నారని ఉపాధ్యాయులు, ప్రిన్సిపాల్స్ పేర్కొనడం గమనార్హం. ఈ పాఠశాలల్లో ఉపాధ్యాయులు తగిన జీతబత్యాలు లేవని, తల్లిదండ్రులనుంచీ ఎలాంటి మద్దతు ఉండ టంలేదని, క్లాస్‌రూమ్‌లు, బోధనాసామగ్రి విద్యార్థులకు సరిపడా లేవని అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు. లాటిన్ అమెరికా దేశాల్లో ఈ తరహా అసంతృప్తి అధికంగా ఉందని సర్వే తేల్చింది.

ఈ మొత్తం పరిస్థితులను అధిగమించడానికి తీసుకోవాల్సిన చర్యలు, బోధనా పరిస్థితుల కల్పనపై సర్వే ప్రత్యేక దృష్టి పెట్టింది. విద్యార్థులకు చదువుకునే వీలు కల్పించడం నుంచీ తల్లిదండ్రులు అందుకు బాధ్యత వహించడం వరకూ పలు అంశాలకు సంబంధించిన సమాచారాన్ని సర్వే అందించింది. చదువునేర్చుకోవడానికి ముఖ్యంగా చదవడం రావడానికి విద్యార్థులకు నిజంగా కల్పించిన అవకాశాల గురించి ప్రత్యేకమైన ప్రశ్నలను కూడా సర్వేలో పొందుపరిచారు. చాలాదేశాల్లో ఎంతో ఉత్సాహవంతులైన విద్యార్థులను కలిగిన ఉపాధ్యాయులు బోధనా అంశాలకు సంబంధించిన సామగ్రిని, కార్యక్రమాలను వినియోగించుకోవడంలో సవాళ్లను ఎదుర్కొంటున్నారు. అలాగే ఎంతో సృజనాత్మక బోధనావిధానాలను కూడా అమలు చేయడంలో నిమగ్నమయ్యారు. చదువుకోవడానికి తగిన వసతులు వీలూ లేని విద్యార్థుల పాఠశాలల్లో ఉపాధ్యాయులు తమ బోధనా విధానం పట్ల విద్యార్థులు ఆకర్షితులు కావడంలేదని, అందుకే ఒకే మూసపద్ధతిలో సాగుతుంటుందన్నారు. అయితే నివేదిక రచయితలు మాత్రం అణగారిని వర్గాల పిల్లలు చదువుతున్న పాఠశాలలకు మౌలిక సదుపాయాల కల్పన అత్యంత అవసరమని ప్రభుత్వాలు దీన్ని కీలకంగా భావించాలని సూచించారు.

# ఉన్నత పాఠశాలల డిసెంబర్ సిలబస్

| విషయం | 6వ తరగతి | 7వ తరగతి |
|---|---|---|
| తెలుగు (ప్రథమ భాష) | 12. కళ్ళుండి చూడలేక (8)<br>13. కుసుమోపదేశం (10)<br>14. ఎలుకమ్మ పెళ్ళి (ఉపవాచకం) (3) | 13. బాల్య క్రీడలు (10)<br>14. గుశ్వం (ఉపవాచకం) (3) |
| హిందీ (ద్వితీయ భాష) | ११. खुशियों की दुनिया (०९)<br>१२. उद्यान (१०) | ११. गुसाड़ी (०८)<br>१२. कबीर के दोहे (०८)<br>१३. प्यारी बिटिया (०८) |
| ఆంగ్లము (తృతీయ భాష) | ***Reading***: P.T. Usha, the Golden Girls<br>***Poem:*** Indian Cricket Team<br>***Extensive Reading:*** Ranji's Wonderful Bat | ***Reading***: A Hero<br>***Poem:*** My Nasty Adventure<br>***Extensive Reading:*** Learn How to Climb Trees |
| గణితం | 9. బీజగణిత పరిచయం (16)<br>10. చుట్టుకొలతలు మరియు వైశాల్యాలు (5) | 7. దత్తాంశ నిర్వహణ (1)<br>8. త్రిభుజాల సర్వసమానత్వం (13)<br>9. త్రిభుజాల నిర్మాణాలు (7) |
| భౌతిక, రసాయన శాస్త్రం | 11. నీరు మనకు ప్రాణాధారం (11)<br>12. సాధారణ విద్యుత్ వలయాలు (12) | 11. జీవులలో శ్వాసక్రియ (11)<br>12. మొక్కలలో ప్రత్యుత్పత్తి (11) |
| జీవశాస్త్రం | | |
| సాంఘీక శాస్త్రం | 16. స్త్రీ, పురుష సమానత్వ దిశగా పయనం (8)<br>17. ప్రాచీన కాలంలో మతం – సమాజం (8) | 16. మొగల్ సామ్రాజ్యం (5)<br>17. భారతదేశంలో బ్రిటీష్ సామ్రాజ్య స్థాపన (8) |
| కళా విద్య | కళా విద్య | కళా విద్య |
| నాట్యం – సంగీతం | నాట్యం – సంగీతం | నాట్యం – సంగీతం |
| శారీరక, ఆరోగ్య విద్య | శారీరక, ఆరోగ్య విద్య | శారీరక, ఆరోగ్య విద్య |
| పని విద్య | పని విద్య | పని విద్య |
| నీతి విద్య | నీతి విద్య | నీతి విద్య |
| కంప్యూటర్ విద్య | కంప్యూటర్ విద్య | కంప్యూటర్ విద్య |

| 8వ తరగతి | 9వ తరగతి | 10వ తరగతి |
|---|---|---|
| పద్య భాగం : 7. కన్యక<br>గద్య భాగం : 7. చీమతల్లి విశ్వాసం<br>ఉపవాచకం : 3. డెల్టా శిల్పి - సర్ ఆర్థర్ కాటన్ | పద్య భాగం : 8. సరదాపాట<br>గద్య భాగం : 8. ప్రపంచశాంతి సమితి సమావేశం<br>ఉపవాచకం : 5. వైద్యరంగంలో ధృవతార- డా॥ ఎల్లాప్రగడ | పద్య భాగం : 9. స్ట్రీట్ చిల్డ్రన్ (వచన కవిత)<br>గద్య భాగం : 8. ఊతపదాలు - వ్యర్థ పదాలు,<br>9. అంబేద్కర్ వ్యక్తిత్వం (66-80వ పేజీ వరకు) |
| १५. डॉक्टर अंबेडकर<br>-<br>- | १४బ్బారావు अशोक का शस्त्र त्याग<br>१३. पत्र लेखन<br>६. एक था कौआ | ६. सुख-दुःख, ७. भीष्म-संदेश<br>१०. पत्र लेखन, ११. ताई<br>७. हमारे त्योहार, ८. बीरबल की चतुराई |
| ***Prose:*** Unit VII<br>***Poem:*** Upside down<br>***Non-Detail:*** 7. In South Africa<br>***Work Book:*** — | ***Prose:*** Unit VII – The School for Sympathy<br>***Poem:*** The World from a Railway Carriage<br>***Non-Detail:*** 7. Many Moons<br>***Work Book:*** Unit – VII | ***Prose:*** Unit X Death before prayers<br>***Poem:*** Where the mind is without fear<br>***Non-Detail:***<br>7. Bassanio Parts with his Ring<br>8. The dark days are at an end<br>***Work Book:*** Unit –X. |
| రేఖీయ సమీకరణాలు - అసమీకరణాలు, రేఖా గణిత పరిచయం | రేఖీయ సమీకరణాలు - అసమీకరణాలు | ఏకాఘాత ప్రణాళిక, త్రికోణమితి |
| ధ్వని, కాంతి, నైట్రోజన్ దాని సమ్మేళనాలు | తరంగ చలనం, ధ్వని, అయస్కాంతత్వం రసాయన చర్యల వేగాలు, రసాయన సమతాస్థితి | ఎలక్ట్రానిక్స్, నూనెలు-కొవ్వులు, రసాయనశాస్త్రం-పరిశ్రమలు |
| మానవ శరీరం ఆరోగ్యం (4.1) | 5. జీవరాసులు - ఆవాసము<br>జీవావరణ తుల్యస్థితి (5.4) కాలుష్యము | పోషణ |
| **13 పీరియడ్లు**<br>**భూగోళశాస్త్రం:** ఎ.పి. భౌగోళిక శాస్త్రం (9,10)<br>**చరిత్ర:** ___<br>**పౌరశాస్త్రం:** ___<br>**అర్థశాస్త్రం:** ___ | **13 పీరియడ్లు**<br>**భూగోళశాస్త్రం:** యూనిట్-VI 4 పాఠం<br>**చరిత్ర:** యూనిట్ - V | **భూగోళశాస్త్రం:** యూనిట్ - I 14వ పాఠం<br>**చరిత్ర:** యూనిట్ - VII<br>**పౌరశాస్త్రం:** యూనిట్ - V |
| కళా విద్య | కళా విద్య | కళా విద్య |
| నాట్యం - సంగీతం | నాట్యం - సంగీతం | నాట్యం - సంగీతం |
| శారీరక, ఆరోగ్య విద్య | శారీరక, ఆరోగ్య విద్య | శారీరక, ఆరోగ్య విద్య |
| పని విద్య | పని విద్య | పని విద్య |
| నీతి విద్య | నీతి విద్య | నీతి విద్య |
| కంప్యూటర్ విద్య | కంప్యూటర్ విద్య | కంప్యూటర్ విద్య |

# ప్రాథమిక పాఠశాలల డిసెంబర్ సిలబస్

| విషయం | 1వ తరగతి | 2వ తరగతి |
|---|---|---|
| తెలుగు | 19. ఎలుక-ఏనుగు 20.ఔటు<br>21. చందమామరావే<br>22. కోతిబావ | 15. జెండా పండుగ<br>16. కుందేలు తెలివి<br>17. కోడి పిల్ల |
| ఇంగ్లీష్ | **At the Zoo** | **Here is Your Coin!**<br>**My Wish!** |
| గణితం | 20 నుండి 100 వరకు సంఖ్యలు (24) | భాగహారం (8)<br>పొడవు (8), బరువు (8) |
| పరిసరాల విజ్ఞానం | 11. నీరు • నీటిని ఎందుకు ఉపయోగిస్తాం.<br>• నీటిని నిలువచేసే పాత్రలు | 12. నీరు (10)<br>• నీరు ఎక్కడి నుండి తెచ్చుకుంటారు?<br>• పాఠశాల-నీటి వనరులు<br>• నీటిని నిలువ జేసే పద్ధతులు. |
| శారీరక, ఆరోగ్య విద్య | శారీరక, ఆరోగ్య విద్య | శారీరక, ఆరోగ్య విద్య |
| కళావిద్య | కళావిద్య | కళావిద్య |
| సంగీతం, నాట్యం | సంగీతం, నాట్యం | సంగీతం, నాట్యం |
| పని విద్య | పని విద్య | పని విద్య |
| నీతి విద్య | నీతి విద్య | నీతి విద్య |



తండ్రి: అంకుల్ పేపర్ అడిగితే
అలా చించుతున్నావేంట్రా?
కొడుకు: మనకున్నదాంట్లో సగం
మాత్రమే దానం
చెయ్యాలన్నారుగా నాన్నా!



చింటూ: నాన్నా నన్ను తిండిపోతు వెధవా
అని తిడుతుంటావుగా పోటీలో మొదటి
బహుమతి దక్కింది
తండ్రి: వెరీగుడ్! ఇంతకీ ఏ పోటీలో
చింటూ: తిండి పోటీ..!

| 3వ తరగతి | 4వ తరగతి | 5వ తరగతి |
|---|---|---|
| 12. గాలిపటం (10)<br>13. కోతి-పెన్సిల్ (10) | 14. వరంగల్ (10)<br>15. సుభాషితాలు (10) | 14. చార్మినార్ |
| **Mary and the Three Bears** | The Story of Bakaura<br>work Sheet VII | The Lost Ring<br>W. Book unit - VIII |
| భాగహారం (12)<br>కొలతలు (11) | ద్రవ్యమానం (24) | అంకగణితం,<br>ఏకవస్తుపద్ధతి |
| 8. నీరు | 6. మన నివాసం | 6. మన నివాసం |
| శారీరక, ఆరోగ్య విద్య | శారీరక, ఆరోగ్య విద్య | శారీరక, ఆరోగ్య విద్య |
| కళావిద్య | కళావిద్య | కళావిద్య |
| సంగీతం, నాట్యం | సంగీతం, నాట్యం | సంగీతం, నాట్యం |
| పని విద్య | పని విద్య | పని విద్య |
| నీతి విద్య | నీతి విద్య | నీతి విద్య |



టీచర్: టింకూ! రోజూ ఎన్ని లీటర్ల నీళ్లు తాగుతావు?

టింకూ: పాలల్లో కలిపే నీళ్లు కూడా లెక్కించాలా టీచర్!?



సేల్స్‌మెన్: బాబూ! చీమల పౌడర్ కొంటారా?

బంటి: వద్దులే ఈ రోజు చీమలకు పౌడర్ అమ్ముతారు, రేపు దోమలకు లిప్‌స్టిక్ అమ్ముతారు

# గ్రామీణ ప్రాంతాల్లో ఉన్నతవిద్య అవకాశాలు ప్రభుత్వ పాత్ర

డాక్టర్. వి.ఎ.జ్యోతి
ప్రాజెక్ట్ మేనేజర్,
సి.ఎం.ఇ.ఎస్,
ఎస్.ఇ.ఆర్.పి, హైదరాబాద్
ఫోన్: 9000404256



పట్టణ ప్రాంతాలతో పోలిస్తే... విద్యావకాశాలు గ్రామీణ ప్రాంతాల్లో నివసించే వారికి చాలా తక్కువ. 2009 సంవత్సరంలో ప్రవేశపెట్టిన విద్యాహక్కు చట్టం 6 నుంచి 14 సంవత్సరాల వయస్సు గల పిల్లలకు ఉచిత, నిర్బంధ విద్యను ప్రవేశపెట్టినప్పటికీ, 10 శాతం నుంచి 15 శాతం వరకు ఇప్పటికీ బడిలో నమోదు కాని పిల్లలు బడి బయట ఉన్నారు(యాన్యువల్ స్టేటస్ ఆఫ్ ఎడ్యుకేషన్ రిపోర్టు 2011).

దీనికి ముఖ్యమైన కారణాలు ప్రభుత్వ పాఠశాలల్లో నాణ్యమైన విద్యను అందించడంలో ప్రభుత్వం సరైన ప్రమాణాలు అవలంభించక పోవడమే. కూలిపనులు చేసుకునే నిరుపేద కుటుంబాలకు చెందిన వారు ప్రయివేటు పాఠశాల్లో పిల్లల్ని చేర్చాలంటే ఎక్కువ ఫీజు చెల్లించాలి. ఆర్థిక స్తోమత లేనివారికి ఇది అదనపు భారం. కనుక ప్రభుత్వ పాఠశాల్లో నాణ్యమైన విద్యను అందిస్తే, పేద విద్యార్థులు మంచి విద్యావకాశాలను పొందుతారు. గ్రామీణ ప్రాంతాల్లో నడుస్తున్న ఆశ్రమ పాఠశాలలు/గురుకుల పాఠశాల్లో విద్యా ప్రమాణాలను పెంచాల్సిన అవసరం, పదో తరగతి చదువుతున్నవారికి పై చదువు పట్ల అవగాహన కల్పించడం ఎంతైనా అవసరం. ఏయే కోర్సులు తీసుకుంటే ఏ విధమైన వృత్తిని ఎంచుకోవచ్చనే విషయాలను నిపుణులతో విద్యార్థులకు చెప్పిస్తే, వారికి భవిష్యత్ పట్ల ఆశ చిగురించి, ఆత్మస్థైర్యం పెంచుకుంటారు.

2011 గణాంకాలను పరిశీలించినట్లయితే... ఆడపిల్లల అక్షరాస్యత 52 శాతం, మగపిల్లలది 70 శాతం. దీనినిబట్టి చూస్తే మన రాష్ట్రంలో గ్రామాల్లో నివసించే ఆడపిల్లలు అందరూ చదువుకోవడం లేదన్నది దీనికి ఒక కారణమైతే, పాఠశాల్లో వారికి ప్రత్యేకంగా మరుగుదొడ్లు లేకపోవడం రెండో కారణం. ఇక మూఢనమ్మకాలు మూడో కారణం. గ్రామీణ ప్రాంతాల్లో మూఢనమ్మకాల వల్ల ఆడపిల్లల్ని పై చదువుల్ని చదివించడం లేదు. ఒకవేళ చదివించినా... వారు మధ్యలోనే చదువును ఆపేస్తున్నారు. ఎంతో కష్టంమీద పదో తరగతి పూర్తి చేసినా, 30 శాతం మంది మాత్రమే ఉన్నత చదువులను కళాశాలల్లో పూర్తి చేస్తున్నారు. దీనికి ముఖ్యమైన కారణాలు మూడు, బాలికావిద్య పట్ల పెద్దగా అవగాహన లేకపోవడం మొదటిదైతే, తల్లిదండ్రుల నుంచి ప్రోత్సాహం కూడా లేకపోవడం రెండో కారణం. సామాజిక పరిస్థితులు అనుకూలంగా లేకపోవడం మూడో కారణంగా చెప్పొచ్చు.

ఇక గ్రామాల దగ్గరగా ఉన్న ప్రభుత్వ కళశాలల్లో అధ్యాపకులు సరిగ్గా లేకపోవడం వల్ల, ఒకవేళ ఉపాధ్యాయులున్నా సరిగా బోధించక పోవడం వల్ల, ప్రయివేటు కళాశాలల్లో చేరి చదువుకోవడానికి సహకరించని ఆర్థిక ఇబ్బందుల వల్ల తదితర కారణాలతో ఆడపిల్లలకు మంచి విద్యావకాశాలు అందుబాటులోకి రావడం లేదు.

ప్రభుత్వం పైన పేర్కొన్న సమస్యల్ని పరిష్కరించాలంటే... ఈ కింది సూచనల్ని అవలంబించాల్సి ఉంది.

- ప్రభుత్వ పాఠశాల్లో ఆడపిల్లలకు ప్రత్యేకంగా మరుగుదొడ్లను నిర్మించాలి.
- అక్షరాస్యత ప్రాముఖ్యతను గ్రామాల్లో ర్యాలీలు, కళాజాతాల ద్వారా అవగాహనా సదస్సులను నిర్వహించాలి.
- బాలకార్మికుల చట్టం సరిగ్గా అమలయ్యేట్లుగా చూడాలి.
- ఆశ్రమ పాఠశాలలు/గురుకుల పాఠశాలల్లో ఉన్నతవిద్య, వివిధ కోర్సుల గురించిన అవగాహనను ఉపాధ్యాయులకు, విద్యార్థులకు కల్పించాలి.
- ప్రభుత్వ కళాశాలల్లో/పాఠశాలల్లో నాణ్యమైన విద్యను అందించేట్లుగా చూడాలి.
- తప్పనిసరిగా పాఠశాలల్లో అకడమిక్ మానిటరింగ్ కమిటీలను ఏర్పాటు చేసి, అవి సరిగ్గా పనిచేసేట్లుగా చూసి, విద్యార్థుల్లో విద్య పట్ల మక్కువ పెంచాలి.

Printed and published by M. Sridhar Rao on behalf of AKSHARA ENTERPRISES, D.NO. 3-6-521, FLAT NO 401, GHARONDA MAYA, HIMAYATH NAGAR, HYDERABAD-29 and printed at SREE MATHA PRINTERS, 1-1-562/1, GANDHI NAGAR, HYDERABAD-20 Published at AKSHARA ENTERPRISES, D NO. 3-6-521, FLAT NO.401, GHARONDA MAYA, HIMAYATH NAGAR, HYDERABAD-29. Editor N Mohan Kumar.

INTRODUCING
**TOP PERFORMERS** AT SCHOOL

Godrej interio




Bravo Chair • Periodical Display Rack
• Lectura Table • Scholar Desk-cum-bench

For more details, please contact us at chandrahasenterprises@gmail.com, tel: +91 040-23220888. Sirish: 96421 12456

67



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA101M251 |
| పుస్తకం పేరు | నవీనవిద్య |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | [illegible] |
| వెనుక అట్ట | [illegible] |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | [illegible] |
| ఖాళీ పేజీలు | [illegible] |
| లేని పేజీలు | [illegible] |
| తయారు చేసినది | Sujanya |
| పేజీలు విడదీసినది | akshaya |
| స్కాన్ చేసినది | AKSHAYA |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | [illegible] |